మనోహరమైన డిజైన్లలో....

# మహావీర్

కాటన్ ప్రింటెడ్ చీరలు






H.K.INTERNATIONAL/MB/TL

మహాబీర్ కాటన్ శారీస్ అన్ని షాపులలో లభించును

ఆంధ్రప్రదేశ్ డీలర్లు : విజయవాడ. శ్రీ ఉమా టెక్స్‌టైల్స్; విజయనగరం : పూనమ్ చంద్‌జైన్; చీరాల : రఘురామా టెక్స్‌టైల్స్;
చిత్తూరు : S.A.A. ఆనందమ్ ఎంటర్‌ప్రైజెస్; నిజామాబాద్ : మోహన్ టెక్స్‌టైల్స్; హిందుపూర్ : విమ్మ ఎంటర్‌ప్రైజెస్;
సికింద్రాబాద్ : రవి హ్యాండ్లూమ్ టెక్స్‌టైల్స్, ...

# ప్రజల నిర్ణయమే తిరుగులేనిది!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

బొంబాయిలో అరేబియా సముద్రానికి అభిముఖంగా ఉన్న ఆ భవనంలోని అయిదవ అంతస్తుకి తీసుకు వెళ్లే ఆ లిఫ్ట్, దానిని ఉపయోగించే వృద్ధులైన స్త్రీ పురుషులలాగే ఆయాస పడుతున్నట్లుగా, పడిపోవటానికి సిద్ధంగా ఉన్నట్లు ఉంటుంది. అయిదో అంతస్తులోని ఆ గది కానీ లేదా గత 40 సంవత్సరాలుగా దానిని తమ పడకగదిగా ఉపయోగిస్తున్న ఆ ప్రముఖ వ్యక్తిగానీ కాలానుగుణంగా మారనట్లు కనిపిస్తున్నది. కొద్ది నెలల క్రితమే మొరార్జీదేశాయికి 90 ఏళ్ళు నిండాయి. కానీ ఆయన నాకు తెలిసిన 70 ఏళ్ల వ్యక్తులకన్నా చిన్నవారిగా కనిపిస్తున్నారు. ఆయన పిడికిలిలో పటుత్వం తగ్గలేదు, కంటి చూపు స్థిరంగా ఉన్నది. ఆయన తమ ఉత్తరాలు తామే చదువుకుంటారు, రాస్తారు. అందుకు ఆయనకి ఎలాంటి ఇబ్బందిలేదు. "నా కసలు ఎటువంటి విచారాలూ లేవు" అంటారాయన చిరునవ్వుతో. ఆయన వయసులో, అనుభవంలో పరిపక్వత చెందిన వృద్ధుడు. ఏదైనా కొంటె ప్రశ్నమీరాయనని అడిగితే ఆయన ఎంత గట్టివాడో తెలుస్తుంది.

ప్రభుత్వాన్ని గురించి, ఇప్పటి రాజకీయ నాయకుల గురించి ఆయన అంతగా ఆలోచించరు. వాళ్లకసలు బుర్రలేదంటారాయన, అంతే కాకుండా అనుభవం అసలేలేదు. తామే కనుక ప్రధాన మంత్రిగా ఉండి ఉంటే పంజాబ్‌లో పరిస్థితిని చెయ్యిదాటి పోనిచ్చే వారం కాదంటారు. ఆయన ఏమి చేసి ఉండేవారు? వాళ్ళు నా దగ్గరికి వచ్చినప్పుడు ఏమి చెప్పానో వాళ్లని (అకాలీలు) అడగండి. శాంతిభద్రతల దృష్ట్యానే కాకుండా అలాంటి విషయాలలో చాలా దృఢంగా వ్యవహరించాలని అంటారాయన. ఆయన ప్రధాన మంత్రిగా ఉండి ఉంటే ఏమి చేసేవారు? వాళ్ళు నా దగ్గరికి వచ్చి అడగనీయండి, ఏమి చెయ్యాలో అప్పుడు చెబుతాను వాళ్లకి అంటారాయన.

ఆశ్చర్యం ఏమిటంటే 90 ఏళ్ళు దాటినా మొరార్జీ ఇంకా దృఢంగానే ఉన్నారు. నేనెప్పుడూ ఆశావాదినే, ఎందుకంటే జీవితంలో లాగే రాజకీయాలలో కూడా నిరాశావాదిగా ఉండలేము కదా అంటారాయన. స్వాతంత్ర్యానంతరం దేశం ఎంతో అభివృద్ధిని సాధించింది అని ఆయన నమ్ముతారు. అయితే అది ప్రభుత్వం వలన జరిగింది కాదు, ప్రజలే కష్టపడి పనిచేసి అభివృద్ధిని సాధించారు. కానీ ఆ ఘనత మాత్రం ప్రభుత్వానికి దక్కింది. దానిని ప్రజలు అర్థం చేసుకోరు అంటారాయన. ప్రజలు తమశక్తి సామర్థ్యాలని తెలుసుకోరు. అది తెలుసుకున్న రోజున భారతీయులు ఇంతకు ముందెన్నడూ లేనంత ఉన్నత స్థితికి దేశాన్ని తీసుకు వెళ్లగలుగుతారు అంటారాయన.

నాయకుల విషయంలో, ముఖ్యంగా దేశాన్ని తామే నడిపిస్తున్నా మనుకుంటున్న అర్జున్‌సింగ్, తదితరులని ఆయన తీవ్రంగా విమర్శిస్తారు. వాళ్ళు అవినీతిపరులనీ, అలాంటి వారిని అసలు అధికార పీఠాల దరిదాపులలోకే రానీయకూడదనీ అంటారాయన. అటువంటి వారిని మొదట శ్రీమతి గాంధి రాజకీయాలలోకి తీసుకువచ్చి, వారికి అధికారాన్ని అప్పగించి ఈ దేశాన్ని ఒక పెద్ద మురికి కూపంగా మార్చారు. చుట్టూ ఉన్న వారివల్ల రాజీవ్‌గాంధి విఫలమైనారని మొరార్జీ అనుకుంటున్నారా? తన సహచరులు అవినీతిపరులైనప్పుడు ఏ వ్యక్తి అయినా నిష్కళంకంగా ఉండగలడా? అసలు అటువంటి వారిని ఆయన ఎందుకు దగ్గరకి చేరనివ్వాలి? అదేమిటన్నది బయటికి చెప్పకపోయినా వారివలన ఆయనకి తప్పకుండా ఏదో ప్రయోజనం ఉండ ఉండాలి.

తమ హయాంలో జనతా పార్టీలో కొంత మంది నిర్వహించిన పాత్ర పట్ల ఆయన తీవ్రమైన అయిష్టాన్ని వ్యక్తం చేశారు. చరణ్‌సింగ్‌పై ఆగ్రహాన్ని ప్రదర్శించారు. సంపూర్ణ విప్లవం వల్ల ఉపయోగం లేదంటారాయన. అసలు అది ఏమిటో మీరు వివరించగలరా? అంటారు ఆయన. సంపూర్ణ విప్లవం అన్నదానికి అవకాశం లేదని ఆయన నమ్మకం. సంఘటనలు వాటికవే జరుగుతాయి, వ్యక్తులూ అలాగే ఉద్భవిస్తారు. బల ప్రయోగం ద్వారా ఏదైనా చెయ్యాలనుకుంటే కష్టాలని కొని తెచ్చుకోవటమే. దేశానికి కావలసింది మంచి పరిపాలన. దానివల్ల ప్రతి పౌరుడూ నిర్భయంగా బ్రతకగలుగుతాడు. నిర్భీతి అన్నది లేకపోతే అసలు ప్రజాస్వామ్యమే లేదు అంటారాయన.

మొరార్జీభాయ్ మాటలలో భారతదేశం ఇప్పుడిప్పుడే ఒక జాతిగా రూపుదిద్దుకుంటున్నది. "మనకి సుదీర్ఘమైన చరిత్ర ఉన్నది, అయితే అది ఒక జాతిగా కాక ప్రజలకి సంబంధించినదిగా ఉన్నది. పూర్వం ఎన్నో సామ్రాజ్యాలు ఉండేవి. అవన్నీ ఒక దానితో ఒకటి పోట్లాడుకుంటూ ఉండేవి. గత వంద లేదా రెండు వందల సంవత్సరాల నుంచి మాత్రమే భారతీయులకి తాము కేవలం ప్రజలమే కాదని అంతకన్నా ఎంతో ఎక్కువ అయిన ఒక జాతి అనే స్పృహ కలిగింది. ఈ భావం పూర్తిగా ప్రజల మనస్సులలో నాటుకోటానికి కొంత కాలం పడుతుంది, ముఖ్యంగా మనమధ్య ఇన్ని రకాల తేడాలు ఉన్నప్పుడు అదేమి వింతకాదు. అసలు అలాంటి భావం అన్నది మనలో నాటుకుంటూ ఉందన్నదే ముఖ్యం" అంటారు ఆయన.

మనం ఒక జాతిగా రూపొందటానికి ఎంత కాలం పడుతుంది? మరో వంద సంవత్సరాలు పట్టవచ్చు. కానీ అంత కాలం కూడా పట్టకపోవచ్చని ఆశావాదిగా ఆయన నమ్మకం. యూరోప్‌ని చూడండి. వాళ్ళు శతాబ్దాలుగా తమలో తాము కలహించుకుంటున్నారు. వారు ఒక పూర్తి స్థాయి






ప్రపంచయుద్ధాన్ని చేసి కూడా ఎన్నో దశాబ్దాలుకాలేదు. కానీ ఇప్పుడు వాళ్ళు పోట్లాడుకోవటం మానేసారు. యూరోప్ ఇప్పుడు నెమ్మదిగా ఒక శాంతియుతమైన ప్రదేశంగానే కాక ఒక జాతిగా రూపొందుతూ ఉన్నది. భారతదేశం కూడా ఒక ఖండమే, దాదాపు యూరోప్ అంత ఉన్నది. అంతేకాక యూరోప్‌కంటే కూడా సజాతీయమైనటువంటిది అని అంటూ "యూరోప్‌కన్నా తక్కువ సమయంలో మనం ఒక జాతిగా ఎందుకు రూపుదిద్దుకోకూడదు" అన్నారు ఆయన.

అయితే అందుకు తగినంత దేశభక్తి మనలో ఉన్నదా? ప్రస్తుతానికి లేకపోవచ్చు. కానీ అదికూడా త్వరలోనే సంభవం అవుతుంది అంటారాయన. మనం ఒకళ్ళ నొకళ్ళం నమ్మక పోవటం అన్నదానిని మానాలి. భయం నుంచి అపనమ్మకం అన్నది పుడుతుంది. ప్రజలని అణచటానికి భయం అనే ఆయుధాన్ని ప్రభుత్వం ప్రయోగిస్తుంది. అత్యవసర పరిస్థితి ఏమిటి? అంటూ ఆయన అది ప్రజల మీద ఒక రకమైన భయాన్ని రుద్దటం లాంటిది. అందుకే జనతా ప్రభుత్వం మొదట ప్రజలని నిర్భయంగా ఉండమని చెప్పింది అన్నారు. "ప్రతి వ్యక్తి స్వేచ్ఛగా మాట్లాడటం, ప్రవర్తించటాన్ని నేను ప్రోత్సహించాను, ఆఖరికి మి లాంటి పత్రికల వారిని కూడా, కానీ మాలో ఉన్న కొందరు కుతంత్రాలు చేసారు" అంటూ ఆయన గబగబా కొన్ని పేర్లు చెప్పారు. అవన్నీ బాగా తెలిసిన పేర్లే. అందువల్లనే మా ప్రభుత్వం ఎక్కువకాలం నిలవలేదు. జనతాని పడగొట్టడానికి మొదట శ్రీమతి గాంధీ చరణ్‌సింగ్‌ని ఉపయోగించుకున్నారు. ఆ తర్వాత చరణ్‌సింగ్‌నే పడగొట్టి ఇంటికి పంపించారు.

ఇప్పుడు ప్రతిపక్షానికి ఏమైనా అవకాశం ఉందని ఆయన భావిస్తున్నారా? పొరపాటు పడుతున్నారంటారాయన. ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేది ప్రజలే కానీ ప్రతిపక్షంకాదు. ప్రభుత్వం చేసే మాయలు మోతాదు మించినట్లయితే ప్రజలే నిర్ణయం తీసుకుంటారు. ఒకసారి నిర్ణయించుకున్న తర్వాత ఇక ఏదీ వారిని ఆపలేదు. జనతా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది జె. పి., లేదా కృపలానీ , లేదా మరెవరో కానేకాదు. శ్రీమతి గాంధీని అధికారంలో నించి దించిన ప్రజలే. అలాంటిది మళ్ళీ జరగవచ్చు. జరుగుతుంది కూడా. ఎప్పుడు? ఈ ప్రభుత్వం మరో 6 నెలల్లో పడిపోతుంది అంటారాయన. ఎందుకు ఆయన అలా అనుకుంటున్నారు? దానికి చిరునవ్వే ఆయన సమాధానం.

ఇక లేచి ఆయన దగ్గర సెలవు తీసుకుంటూ ఉండగానే ఆయన తిరిగి తమ గీతా పఠనానికి ఉద్యుక్తులవుతారు. ఆయనకి అది కంఠతావచ్చు. ఆ మాట మీరు అడిగితే, 1934 నుంచి నాకు అది నోటికి వచ్చు అంటూ ఆయన మీకు వీడ్కోలు చెప్పారు. □

ప్రేక్షకులపై అనూరాధ వాలుచూపుల తూపులు!

పాఠకులపై

# సినిమా రంజని

సమ్మోహనాస్త్రం!!



ఆంధ్రుల అభిమాన సంస్థ

**ఆంధ్రపత్రిక** నుంచి

త్వరలోనే దూసుకువస్తోంది!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

15-21 ఆగస్టు 1986
శ్రీ అక్షయ నామ సం. శ్రావణ శు. దశమి
సంపుటము 78 : సంచిక 49

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'అందాలరాశి' కిర్తి సింగ్
(ఫోటో : ఎస్. జి. కె. మూర్తి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటన కర్తలందరికి స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు

— సం

## కథలు

4-10 జూలై సంచికలో 'పితృదేవోభవ' కథ బావుంది. వృద్ధులైన తల్లిగాని, తండ్రిగాని తమ పిల్లలకు-మనుమలకు అక్కు గొడలా, గుదిబండలా వుంటక, ఏదో ఒక ఆశ్రమం వెతుక్కోవాలి అనే భావాన్ని వ్యక్తం చేశారు.

కిర్తి కిష్టయ్య, లక్ష్మిదేవిపల్లి

★ ★ ★

11-17 జూలై 1986 నటి "రూప" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. కథలు "మరో బానిస", "ఉన్నతులు" చాలా బావున్నాయి.

దొడాబత్తుల పాండురంగారావు,
శ్రీనివాసన్, కుప్పనపూడి

## సీరియల్స్

నటి రూప ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా బాగుంది. "కరిగినశిల" సీరియల్ చాలా ఆసక్తికరంగా ఉన్నది.

కుంచం శ్రీనివాస్, ద్రాక్షారామం

★ ★ ★

నటి రూప ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది. సీరియల్స్ కరిగిన శిల, కాల్‌గర్ల్ వెరైటీగా, వ్యవస్థకు అద్దం పట్టినట్టుగా, సాగిపోతున్నాయి.

కిర్తి కిష్టయ్య, లక్ష్మిదేవిపల్లి

## పెద్దకథ

మిత్ర చతుష్టయం (పెద్ద కథ) వంగ భాష నుండి తెలుగు సేత ఎంతో సరళంగా వుంది. పాత్రల పేర్లు బట్టి అనువాద మనుకోవాలి తప్ప అనువాదంలా లేదు! శితేశ్ కథనం తేట తేట తెలుగు నుడికారంతో సాగి తెలుగు- వంగ భాషలలో రచయితకు గల ప్రజ్ఞని ప్రస్ఫుట పరిచింది!

–సుంకర భాస్కరరావు, తుని

★ ★ ★

"మిత్ర చతుష్టయం" చాల బాగుంది. ప్రకృతి దృశ్యాలు చక్కగా అనువదించారు రచయితగారు.

కె. వి. నాగేశ్వరరావు, నారు రాజపాలెం

## వ్యాసాలు

4-10 జూలై '86 హీరో చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగున్నది. కుషానుల నాగరికతకు ప్రతి రూపం "మధుర శిల్పకళ" గురించి చక్కని, తెలియని ఎన్నో విషయాలను తెలియజేసింది. చక్కని ఛాయాచిత్రాలను పత్రికాముఖంగా ప్రచురించి మాకు ఆనందాన్ని చేకూర్చారు. వారపత్రిక మా చేతికందగానే మధుర వెళ్ళి చూస్తున్నట్లనిపించింది.

దొడాబత్తుల శ్రీనివాసన్,
విశ్వనాథన్, కుప్పనపూడి

## హైదరాబాద్ నోట్‌బుక్

11-17 జూలై సంచికలో హైదరాబాద్ నోట్‌బుక్‌లో నవోదయ పాఠశాలలని గురించి రాస్తూ రెండు వర్గాలు ఏర్పడతయి అని రాశారు. ఇప్పుడు మాత్రం వర్గాలు లేనట్టు! మన పెద్దలంతా మాతృభాషని పొగడ్తూ తమ పిల్లలని మాత్రం ఇంగ్లీషు మీడియం స్కూళ్లలో చదివిస్తూ ఉంటారు. మాతృభాషలో చదువుకునే విషయాలు గ్రహిస్తే కడుపునిండదు. విషయ గ్రహణతో పాటు కూడు కూడా పెట్టేదిగా ఉండాలి చదువు. అలాంటి అవకాశాలు ఇప్పటికి ఆంగ్లంలో చదువుకున్న వారికే ఉన్నాయి. మన దగ్గర ప్రతిది ద్వంద్వపాలనయే. ఇంకోళ్ళకి చెప్పేది వేరు – మనం చేసేది వేరు. అలాంటప్పుడు నవోదయ పాఠశాలల వల్ల కొత్తగా వచ్చే నష్టం ఏమి లేదు.

కె. రామారావు, హైదరాబాద్ □

సీరియల్

# కరిగిన శిల

రాపినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

భారంగా తెల్లారింది.

అతనొస్తాడేమో అని ఆఫీసు టైమయ్యే దాకా చూసింది సరయు. అతను రాలేదు.

వుసూరుమంటూ ఆఫీసు కెళ్ళిపోయింది. సాయంత్రం వస్తూనే అతని పోర్షన్ కేసి చూసింది. అది తాళం వేసే వుంది. నిరాశగా ఇంట్లో కొచ్చేసింది.

"ఇంతసేపూ అతను ఇంటికి రానేలేదా? ఇవాళ వెళ్ళిపోతానన్న మనిషి... ఇంత వరకు ఎందుకు రాలేదు. లేకపోతే తనతో తమాషా కన్నాడా?" అని ఆలోచిస్తున్న సరయుకి హటాత్తుగా ఏదో అనుమానం వచ్చి ఓరగా వేసి వున్న రమణ కిటికీ లోంచి తొంగి చూసింది. అంతే! ... నిర్ఘాంతపోయింది.

ఆమె వూహించినట్టు అతను ఇల్లు ఖాళీ చేసేశాడు. గదంతా ఖాళీగా వుంది.

"అంటే ... తనతో చెప్పకుండానే తన అద్దె డబ్బులు ఇవ్వకుండానే వెళ్ళిపోయాడా?" విస్మయంగా అనుకుంది. ఎందుకో అతనలా చేసాడని అనిపించడం లేదు. ఇవాళ కాకపోతే ... రేపు, రేపు కాకపోతే మరో రోజు తప్పకుండా వస్తాడు. తనకి వెళ్ళేటప్పుడు చెప్పకుండ వెళ్ళినందుకు "సారి" చెప్తాడు." అనుకుంది నమ్మకంగా.

ఎలాగో పనంతా ముగించుకుని హాల్లో కూర్చుంది సరయు. ఏ చిన్న అలికిడి అయినా తృళ్ళి పడుతోంది.

అతను రాగానే ఎలా ఆహ్వానించాలో, ఎలాంటి మాటలతో నొప్పించాలో, ఎలాంటి వాడి పదాల్ని వుపయోగించి బాధ పెట్టాలో, మొహం పాలిపోయేలా ఎలా అవమానించాలో వూహించుకుంది.

ఆరు!, ఏడు, ఎనిమిది కూడా అయిపోయింది. అతను రాలేదు. కానీ హటాత్తుగా వాతావరణంలో మార్పొచ్చింది. కారుమబ్బులు కమ్మి చల్లని గాలి వీచడం ప్రారంభమైంది.

సన్నగా జల్లు కొడుతుంటే లేచి కిటికీ తలుపులు వేసి మంచం మీద కూలబడింది సరయు.

మరో పది నిమిషాలకి వీధి తలుపు తట్టిన చప్పుడై తృళ్ళిపడింది. ఎందుకో గుండె వేగంగా కొట్టుకుంది. ఆ తలుపు తట్టింది రమణే అనిపించిందామెకి.

మళ్ళీ ఓసారి తలుపు తట్టారెవరో.

సరయు లేచి తలుపు తీసింది.

ఎదురుగా రమణ!

జల్లుకి కాస్త తడిసినట్టున్నాడు.

"రండి!" అదుము తొలుగుతూ అంది సరయు. ఆమె గుండెల్లో అవమాన జ్వాల రగులుతోంది.

"సారీ! .... మధ్యాన్నం వచ్చి సామాన్లు తీసికెళ్ళిపోయాను. అప్పుడు మీరెలాగూ వుండరని ఇప్పుడొచ్చాను" అన్నాడతను కూర్చుంటూ.

అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది సరయు. అయితే ఎప్పటిలా ఆ కళ్ళు సీరియస్‌గా లేవు. ఎర్రగా అంతకన్నా లేవు. ఇంకా చెప్పాలంటే కాంతివంతంగానూ, చిలిపిగా చూస్తున్నట్టూ వున్నాయి. పెదవులు నవ్వుతున్నాయి. క్షణం ఆశ్చర్యపోయింది సరయు. వెంటనే అతను తనని అవమానించిన విషయం గుర్తొచ్చి గంభీరంగా అయిపోయింది.

"మీరీ పుస్తకం చూస్తూండండి. నేను కాఫీ తెస్తాను." అంటూ లోపలి కెళ్ళబోయింది.

"ఒద్దు! నేనిప్పుడే భోజనం చేశాను." అంటూ వారించాడతను.

ఆమె మౌనంగా కూర్చుండిపోయింది.

ఇద్దరూ ఎదుటి వారు మాట్లాడతారు అన్నట్టుండి పోవడాన వారిద్దరి మధ్యా కాస్సేపు మౌనం రాజ్యం ఏలింది.

"ఇదిగో మీ అద్దె!" రమణే మౌనాన్ని ఛేదించాడు. సరయు మాట్లాడలేదు. రమణ కొన్ని నోట్లని స్టూల్ మీద పెట్టి ఓ పుస్తకం ఒత్తు పెట్టాడు.

"మరి... నేను వెళ్ళనా?" అన్నాడు ఓరగా ఆమెనే చూస్తూ.

"అప్పుడేనా?" నవ్వింది సరయు.

అది మామూలు నవ్వు కాదు... భయంకరమైన నవ్వు. ఒళ్ళు జలదరింపజేసే నవ్వు!

"ఏం? వెళ్ళొద్దా?" ఆమె భావాల్ని గ్రహించనట్టు కొంటెగా అన్నాడు రమణ.

"అవును..... అప్పుడే వెళ్ళనివ్వను!"

"థాంక్యూ!" .... అల్లరిగా నవ్వాడతను.

"థాంక్సా?... ఎందుకు?"

"నన్ను వుండ మన్నందుకు!"

"అందుకు ... మీరు థాంక్స్ చెప్పకూడదు." కఠినంగా అంది సరయు.

"మరి? సారి చెప్పాలా?" అమాయకంగా అన్నాడు రమణ.

"అది మీరే వూహించుకోండి! ప్రస్తుతం నేను మాత్రం రెండు నిమిషాలు మాట్లాడతాను."

జరిగిన కథ- 7: సరయుకి రమణతో చనువు పెరిగింది. డా. శ్యామల భర్త డా. ప్రభాకర్ మామగారి ఊరిలో ప్రాక్టీసు పెట్టను ఒప్పుకోలేదు. సరయు మాధవ్ కార్లోంచి దిగటం రమణ కంటబడింది. కానీ సరయుకి ఆ సంగతి తెలియదు. రమణ తను సరయు నుంచి దూరంగా పారిపోవాలనుకుంటున్నట్టు ఆమెతో చెప్పి వెళ్ళాడు. తనని అవమానించిన రమణని తిరిగి అవమానించాలని అతని రాక కోసం ఎదురు చూస్తూ ఉంటుంది సరయు.

"రెండు నిమిషాలు కాకపోతే రెండు గంటలు మాట్లాడండి!" నవ్వాడతను.

సరయు నవ్వలేదు. మరింత సీరియస్‌గా అయిపోయింది.

"అవసరం లేదు!.... కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాక మీరెవరో, నేనెవరో!" అంది.

"సరే! మాట్లాడండి!" స్టడీగా కూర్చున్నాడతను.

"నా గురించి మీరేమనుకుంటున్నారు?" ఎంత సౌమ్యంగా అనాలనుకున్నా ఆమె గొంతులో కాఠిన్యమే తొంగి చూసింది.

"ఒక అందమైన, అమాయకురాలైన ఆడపిల్ల! అని!" తడువుకోకుండా ఠపీమని అన్నాడు రమణ.

"తాచుపాము కూడా అందంగానే వుంటుంది!" కస్సుమంది సరయు.

"అఫ్‌కోర్స్! అమాయకంగా మాత్రం వుండదు!" అతని కంఠంలోని చిలిపిదనానికి మరింత మండి పడింది సరయు.

"నేను అమాయకురాల్నా? ఎందుకనుకుంటున్నారలా?"

"చూస్తే తెలియడం లేదూ?... బెదిరిపోయే ఆ లేడి చూపులూ, గొంతులో ఆ మార్దవం, ఇంత చల్లని గాలి వీస్తున్నా మొహంనిండా చిరుచెమటలు ..." అతని మాట పూర్తి కాకుండానే-

"ఆపండి!" అని అరిచింది సరయు.

"నేను నిజమే చెప్పాను!" బుద్ధిగా అన్నాడు రమణ.

"మీరన్నది నిజం కావచ్చు!... కానీ అలా కనిపించినంత మాత్రాన అమాయకురాల్ననుకుంటే మాత్రం మీరు అమాయకులనుకోవాలి.



# కరిగిన శిల

పరమశివుడు అమాయకుడంటారు. ఆయనలో దాగి వున్న హాలాహలాన్ని మాత్రం మర్చిపోతారు. తెరిచినంత మాత్రాన ఎదుటివన్నీ భస్మం చేసే మూడో కన్నుని ... విస్మరిస్తారు.

అంతులేని సాగర మధ్యమం అందంగా, మరెంతో నిశ్చలంగా వుంటుంది. కానీ అక్కడెంత లోతుగా వుంటుందో ఎంత ప్రమాదకర జీవరాశులుంటాయో మన వూహకందదు.

అబలలా కనిపించే స్త్రీ కూడా అవసరం అయితే ఆదిశక్తిగా మారుతుందని పాపం! ... మీరు గ్రహించడం లేదు!...." ఆవేశంగా అంది సరయు.

"అంటే ... నాక్కనిపించే ఈ అందమైన స్త్రీమూర్తి కూడా ... ఆదిశక్తి అవతారం ఎత్తుతుందా? అమ్మ బాబోయ్!" భయం నటించాడతను.

"షటప్!" తనని తాను మరిచి అరిచింది సరయు.

"అలాగే ... ఇంక మాట్లాడను.... కానీ ... ఇంత లెక్చర్ మీరు దేన్ని గురించి ఇచ్చారో నాకు అర్థం కావడం లేదు." అమాయకంగా అన్నాడు రమణ.

"అర్థం కావడం లేదూ? బాగా గుర్తు తెచ్చుకోండి!" రెట్టించింది సరయు.

"సారీ! అసలే నాకు జ్ఞాపకశక్తి తక్కువ! మీరే చెప్పెయ్యండి."

"సరే! ... నిన్న మీరేవన్నారు?" అంది సరయు.

"ఏవన్నాను?"

"అదే ... మీరు వెళ్ళడం గురించి..."

"ఓ! అదా? .. ఉన్నమాటేగా?"

"అదే. ఏవిటా వున్నమాట?"

"ఏవుంది.... మీ నుంచి దూరంగా పారిపోవాలనుకున్నాను అన్నాను!" నిర్భయంగా అన్నాడు రమణ.

"అంటే ... మిమ్మల్ని ... నేను కట్టేశానా?" ఆమె గొంతు ఒణికింది.

"ఇంకా లేదు!..."

"అంటే?" ....

"ఇంక ముందు మీకు బందీనైపోతానేమో అన్న భయంతో ....."

"వాడ్యూ యు మీన్?" కుర్చీలోంచి విసురుగా లేచింది సరయు.

"అయ్ మీన్ .... చేపపిల్లల్లా మిలమిల మెరిసే అందమైన మీ కంటి చూపు ఏరితూపై నాకు తాకక ముందే... శంఖం లాంటి మీ మెడ మీద సూదుల్లా నా చూపులు గుచ్చుకోక ముందే, అద్దాల చెక్కిళ్ళపైనా మోవి ముద్ర పడక ముందే, దొండ పండులాంటి లేత పెదవుల మధురిమని చవి చూడకముందే... మీ బారెడు వాలుజడ వలపు పాశమై నన్ను బంధించక ముందే ... దూరంగా వెళ్ళిపోవాలనుకున్నాను... తప్పా?" సవాల్ చేసినట్టు అన్నాడు రమణ.

ఎదురు చూడని ఆ మాటలకి నిర్ఘాంతపోయింది సరయు. అతన్ని అనాలనుకున్న అన్ని మాటలూ అడుగున పడిపోయాయి. పిచ్చి ఆవేశం మాత్రం ఆమెని వుక్కిరిబిక్కిరి చేసేసింది.

"ఎంత ధైర్యం?... నేను ...నిన్ను చూపులతో బంధించానా? ... నీ కళ్ళల్లోకి సూటిగా చూడ్డానికే ఇష్టపడని నేను ... నిన్ను వలపు పాశంతో బంధిస్తానా? వెళ్ళు! ముందిక్కణ్ణుంచి వెళ్ళి పో! ఇంకా ఇక్కడే వుంటే నిన్నేం చేస్తానో నాకే తెలియదు." అరిచింది సరయు.

ఆమె మాటలకి అతను బెదరలేదు. పైగా –

"కూల్ అవండి మేడమ్! ... అంత ఆవేశం ఒంటికి మంచిది కాదు!" అన్నాడు విలాసంగా.

అతని మాటలు మరీ రెచ్చగొట్టాయామెని.

"యూ రాస్కెల్! ... ఏం వాగుతున్నావ్... గెట్టవుట్! ... గెటవుట్ అయ్ సే!" అతనికేసి నాలుగడుగులు వేసి గుమ్మం కేసి చెయ్యి చూస్తూ అంది.

ఆకాశం భయంకరంగా గర్జించింది. వర్షపు హోరు హటాత్తుగా పెరిగిపోయింది.

"ఓ! కే! ... ఎలాగో వెళ్ళిపోవాలనే అనుకుంటున్నాను. మీరు వుండమన్నా వుండను. గుడ్‌బై!" వెనక్కి తిరిగాడు రమణ.

అతను అంత హాయిగా వెళ్ళడం ఆమెకే మాత్రం నచ్చలేదు. "తన మాటలు అతన్నేం బాధించినట్టు లేవు. మరింత పరుషంగా మాట్లాడి – అవమానంతో కృంగిపోయేలా చెయ్యాలి!" అనుకున్న సరయు –

"ఆగు!" అంది గర్జించినట్టు.

రమణ ఆగాడు.

మళ్ళీ పెద్దగా వురిమింది ఆకాశం.

వానతో పాటు గాలి కూడా వుధృతం అయి ప్రకృతి భయంకరంగా తయారయింది.

"ఏ సంఘటనతో నా మీద ఇంతటి అభాండం వేశావ్?" నిలదీసినట్టు అడిగింది సరయు.

"నన్ను ప్రేమించావని గ్రహించాను గనక!" వెనుతిరిగి తాపీగా అన్నాడతను.

"నిన్ను ప్రేమించానా" అసహ్యంగా చూసింది సరయు.

"అవును! ... నీ హృదయంలో నాకు స్థానం వుంది!"

"ఛ! ...నిన్ను ప్రేమించే వాళ్ళు కూడా వుంటారా?" ఛీత్కారంగా అంది సరయు.

"ఏం? నేను మనిషిని కానా?"

"నువ్వా? మనిషివా? ఛీ! కాదు! కానేకాదు! భగవంతుడిచ్చిన అందమైన రూపాన్ని ఎరగా చూపించి అమాయకులైన ఆడపిల్లల్ని అమానుషంగా నలిపి పారేసే నరరూప రాక్షసుడివి. నిన్ను ... నిన్ను...." ఆమె మాట తడబడింది.

"ఓ! అయితే నేను అందంగా వున్నానని నువ్వూ ఒప్పుకున్నావన్న మాట! ... అంటే ... నా రూపాన్ని చూసి నువ్వు దగ్గరైనట్టేగా ... ఇంకా ఆలస్యం ఎందుకు డియర్....."

అతని మాట పూర్తి కానేలేదు. దెబ్బతిన్న పులిలా రమణ దగ్గరికొచ్చి, రెండు చేతులతో అతని చొక్కా పట్టి గుంజి, అతని కళ్ళల్లోకి ఏహ్యంగా చూస్తూ –

"ఛీ! నేను నీకు చేరువవుతానా? నీలాంటి అధముణ్ణి కోరి చేరిన ఆడపిల్లలు శలభాల్లా మాడిపోవడం కళ్ళారా చూసిన ఈ సరయు నిన్ను ప్రేమించిందా? ... తాగుడు మైకంతో వుచితానుచితాలు మరచి ఆడపిల్లల్ని ఇంటికి తెచ్చుకుని అనుభవించే నీకు మనసిస్తుందా?... ఛీ! ఛీ! .... ఈ సరయూనే కాదు... మనసున్న ఏ కన్నెపిల్లా నీ ఛాయలకి రాదు! ... కోరి నరకంలోకి అడుగు పెట్టదు!" పూనకం వచ్చినదానిలా వూగిపోయింది సరయు.

అంత వరకు నవ్వుతున్న రమణ కళ్ళు హటాత్తుగా ఎరుపు రంగుకు తిరిగాయి.

"నేను ఏ ఆడపిల్లని నలిపి నాశనం చెయ్యడం చూశావ్?" ఆవేశాన్ని బలవంతంగా తొక్కిపెడుతూ అన్నాడు.

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

స్వర్గలోకము కలదు సజ్జనుల కొరకు
కలదు నరకమ్ము క్రూర దుష్కర్మతులకు
పుడమి నడచుచున్నది గురు బోధ వలన
బోధ లేకున్న భువి మండి బూదిగాదె!

భక్తియందున అనుపమ శక్తి గలదు
భక్తియందున అతులిత యుక్తి గలదు
భక్తి వైరాగ్య భావాలు పతనమయిన
ఉర్విలో ముక్తి భావములుండబోవు

దానమిచ్చిన ఫలితమ్ము తనకె జేరు
పాతిపెట్టిన బంగారు పరుల జేరు
తప్పుగా తలపగ రాదు దాన మొసగి
దానపరునకు చేకురున్ దారిబువ్వ

- కనమలూరు వెంకటశివయ్య

"హూఁ! ఒకరా, ఇద్దరా? నీ బ్రతుకే అదయినప్పుడు ఇంకా లెక్కలు కూడా ఎందుకు? కానీ .. ఇలాంటి పనులు చేసిన వాళ్ళు ఏదో ఓ రోజున ... కూలిపోతారు. అది మాత్రం గుర్తుంచుకో."

"షటప్!" ఆవేశంగా అన్నాడు రమణ. అతని కళ్ళు మరింత ఎర్రబడ్డాయి. ఆమె చేతిలోని చొక్కా లాక్కున్నాడు.

"ఛ! నీతో నాకు మాటలేవిఁటి! వెళ్ళు! వెళ్ళి ... అమాయకపు కన్నెపిల్లల కోసం వేట ప్రారంభించు ... కానీ ... నాకే కనక అధికారం వుంటే...."

"ఊఁ! వుంటే" పెదవి బిగబట్టి అన్నాడతను.

"వుంటేనా... అందమైన నీ కళ్ళని పొడిచేస్తాను. అనేకమంది ఆడపిల్లల అధరాలను చవి చూసిన నీ పెదవుల్ని నరికేస్తాను. ఆడపిల్లల్ని అగాధాల్లో పడేసే నీ ముఖాన్ని యాసిడ్‌లో ముంచేస్తాను. రోజుకో కొత్త అనుభవం కోరే నిన్ను నిలువునా పాతేస్తాను! నీకో మనసు! దానికో ప్రేమా! ఛ! ..." ఆవేశంతో తనని తాను మరచిన సరయు అతని చొక్కా చించబోయింది.

"హద్దులు మీరుతున్నావ్!" సరయు జబ్బని బలంగా గుచ్చి పట్టుకుంటూ అన్నాడు రమణ.

ఒకరి కళ్ళల్లో ఒకరు తీక్షణంగా చూసుకున్నారు.

"నా హద్దులు గుర్తు చెయ్యడానికి నువ్వెవరివి! ఇది నా ఇల్లు! నా ఇష్టం! ఫో! ఇక్కణ్ణించి!" అతని చొక్కా విడకుండానే అంది సరయు.

ఆవేశంతో బుసలు కొడుతున్న రమణ ఆమె రెండు జబ్బల్ని పట్టుకుని అంతకన్నా బలంగా గుంజాడు.

అంతే! సరయు అతని చేరువగా వచ్చేసింది. అదే సమయంలో లైట్స్ పోయాయి.

ఒకరి వూపిరి ఒకరికి వెచ్చగా తగుల్తోంది. ముఖాలు అతి చేరువగా వచ్చేశాయి.

హటాత్తుగా ఆ కటిక చీకటిలో అతని పెదవులు ఆమె పెదవుల్ని మూసేశాయి. అతని చేతులు ఆమె చుట్టూ లతలా అల్లుకున్నాయి.

అతని కౌగిలిలో పుష్ప సరయు అతని పెదవుల మధురిమని ...

చూస్తున్నట్టు అలా నిల్చుండి పోయింది!

ఆమె విదిలించుకోలేదు. "ఒదులు!" అని అరవనూ లేదు. అదోలాంటి మైకంలో పడిపోయింది.

ఇద్దరూ అలా స్వప్నావస్థలో కొన్ని క్షణాలు గడిపారు. కొంతసేపు తర్వాత కరెంటు వచ్చి గదంతా వెలుగుతో నిండి పోయింది.

తృళ్ళిపడి వాస్తవంలోకి వచ్చిన ఇద్దరూ చటుక్కున విడిపోయి దూరం జరిగారు.

సరయు మొహం నెత్తురు బొట్టు లేనంతగా పాలిపోయింది.

"ఇది ... ఇదెలా సంభవం? ఒకర్నొకరు విపరీతంగా ద్వేషించుకునే తామిద్దరూ అంత చేరువ ఎలా అయ్యారు? ఇదంతా ప్రకృతి చేసిన గారడీనా... లేక అతనంటే తనకి.... ప్రేమలాంటి దేమైనా...."

ఉన్నచోటే కూలిపోయి రెండు చేతుల్లోనూ ముఖాన్ని దాచుకుంది.

రమణ మొహం కూడా.... చెప్పలేనంతగా పాలిపోయింది.

"అయామ్‌సారి! అయామ్ వెరిసారి" అని గొణుగుతున్నట్టు అనేసి తలుపు తీసుకుని ధారాపాతంగా కురుస్తున్న వర్షాన్ని సైతం చూడకుండా చీకట్లో కలిసిపోయాడు.

సరయు మనసంతా అల్లకల్లోలంగా అయిపోయింది.

"ఛ! ఎంత సిగ్గుమాలిన పని! ఈ రోజు తనకేమైంది? పరాయి మగాణ్ణిపట్టి అలాగుంజడానికి తనలోని ఆడతనం ఎలా సాహసించింది. అయినా అంత అసహ్యించుకునే వ్యక్తి తనని చుట్టేస్తే విదిలించి కొట్టక ఆ కౌగిలిలో ఎందుకలా ఒదిగిపోయింది? అంతే కాకుండా... అతనికి స్పర్శ ఎందుకు తననంత పులకింప చేసింది?

ఛ! అతన్నేదో చెయ్యాలనుకుని తనే ఏదో అయిపోయింది.... అతను నిజంగా సరయు చపలచిత్త అనుకునేలా ప్రవర్తించింది. అతను వెళ్ళిపోతానన్నప్పుడు వెళ్ళనిస్తే ఎంత బావుండేది!" ఆమెకి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది.

# కరిగిన శిల

అలా ఏడుస్తూనే మంచంమీద కొరిగింది. వీధి తలుపులు వెయ్యాలన్న ధ్యాసైనా లేకుండా.

★ ★ ★ ★ ★ ★

ప్రభాకర్ మోహన్రావుతో కలిసి ఆడిన నాటకంతో చిత్రంగా మంచి మార్పొచ్చింది శ్యామలలో.

ఆమెకి మునుపటి చిరాకులేదు. విసుగులేదు. ఎంతో ఆప్యాయంగా పలకరిస్తున్న డాక్టరమ్మని చూసి విస్తుపోయారు పేషెంట్స్. ప్రభాకర్ తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు.

గర్విష్టి అనుకున్న కోడలు హటాత్తుగా సౌమ్యురాలుగా అయిపోవడం చూసి మురిసిపోయారు అత్తమామలు.

పెళ్ళయిన కొత్తలో... శ్యామల ప్రవర్తన చూసి... కాస్త బాధపడ్డారు సుబ్బారావు, భార్య. ఆమెవల్ల తమ ఏకైక పుత్రరత్నం ఎక్కడ బాధపడతాడో అని బెంగ పెట్టుకున్నారు.

ప్రభాకర్ మీద ఈగవాలినా సహించలేడు సుబ్బారావు.

ఆయనకి ఏ పదవీ లేకపోయినా కూర్చున్న చోట్నుంచి కదలకుండా చక్రం తిప్పెయ్యగల సమర్థతుంది. కేంద్రస్థాయిలోని పెద్దలు చాలామంది ఆయన స్నేహితులు. వారితో పాటు ఓ పోలీసాఫీసరు బంధువవడం కూడా ఆయనకి చాలా తృప్తినిచ్చింది. ఇప్పుడు కోడల్ని గురించిన బెంగ లేకపోవడంతో ఆయనకి ఏనుగునెక్కినంత ఆనందంగా వుంది.

★ ★ ★ ★ ★ ★

సరయు యాంత్రికంగా ఆఫీసుకెళ్ళొస్తున్నా రమణ తాలూకు జ్ఞాపకాలు ఆమెని విడిచి పోవడంలేదు. ఆ రోజు వర్షంలో తడుస్తూ వెళ్ళిపోయిన రమణ మళ్ళీ ఆమెక్కనిపించలేదు.

ఒంటరితనం సరయుని మరీ కృంగదీస్తోంది. వనజ గర్భవతి అవడంతో ఎక్కువగా రావడంలేదు.

ఆ మధ్య విషయం తెలిసి వాసంతి, కల్పనా వచ్చి.... ఆమెని పరామర్శించి వెళ్ళారు. ప్రాణ స్నేహితురాలికి వున్న ఒకే ఒక ఆధారం కూడా పోయినందుకు... చాలా బాధపడ్డారు. కొన్నాళ్ళపాటు తమ ఇళ్ళకొచ్చి వుండమని బ్రతిమాలారు.

అయితే సరయు అందరి కోరికల్ని సున్నితంగా తోసిపుచ్చింది.

అలాగే ఒంటరిగా నిస్సారమైన జీవితం అనుభవిస్తోంది. తోచనప్పుడు ఎప్పటిలా డాబా మీదికెళ్ళి వంశధార వైభవాన్ని చూస్తుండేది.

"వంశధార" కేసి చూసినప్పుడల్లా ఆమెకి ప్రభాకర్ గుర్తొచ్చేవాడు. అప్పుడు అతను చేసిన సహాయం, తల్లి మరణం గుర్తొస్తాయి. మనసు మరింత భారంగా అయిపోతుంది. అయినా డాబా మీదికెళ్ళడం మానదు.

ఆ రోజు లంచ్‌టైమ్‌లో ఆఫీసు యడ్రస్‌కి ఓ రిజిష్టర్ కవరొచ్చింది సరయుకి. ఆశ్చర్యపోతూ ఫ్రమ్ యడ్రస్ చూసి తృళ్ళిపడింది.

రమణ అనుంది.

ఎందుకో ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

ఓసారి కవర్ని అటు ఇటు తిప్పిచూసింది. ఆ కవరు చాలాబరువుగా వుంది. కుతూహలంగా తెరవబోయి ఎవరో రావడంతో బేగ్‌లో పెట్టేసింది.

ఆఫీసు టైమ్ అయిపోగానే ఇంటికి బయలుదేరింది. ఆమె నడుస్తున్నా ఆమె ధ్యాసంతా బేగ్‌లోని కవరుమీదే వుంది.

"అది ఏమైవుంటుంది?... ఆనాటి సంఘటనకి క్షమార్పణలా?... లేకపోతే తన ప్రవర్తనకి చివాట్లా?" ఇలా ఆలోచిస్తూనే ఇల్లు చేరింది సరయు.

వీధితలుపులు బిగించి చకచక ముఖం కడుక్కొని కాఫీ కలుపుకుని తాగి తరిగ్గా మంచంమీద కూర్చుని బేగ్‌లోని కవరు తీసింది.

కవర్లో కొన్ని కాగితాలు పిన్‌చేసి వున్నాయి. ఆ కాగితాల మధ్యనించి మరో చిన్నలెటర్ కింద పడింది. ఆశ్చర్యంగా దాన్నితీసి చూసింది.

ఆమె కుతూహలంతో పాటు రక్తం వడివడిగా ప్రవహిస్తున్నట్టనిపించింది. ఆమె కళ్ళు అక్షరాలవెంట పరుగులు తీశాయి.

ప్రియమైన సరయూ!...

ఏమిటీ ఉత్తరం అని ఆశ్చర్యపోతున్నావుకదూ?.... అవును. అనుకోని, ఎదురు చూడని వుత్తరం యిది. నేను చేసిన పొరపాటుకి ఇంకా క్షమించి వుండవని తెలిసే రాసే వుత్తరమిది.

సరయూ!... నిజంగా నీకు ద్రోహం చెయ్యాలనే వుద్దేశం నాకేనాడూలేదు. నువ్వు ప్రేమించి వరమాల వేస్తావనుకునేంతటి అమాయకుణ్ణి కాదు!...

నాకు నీ మనసు తెలుసు. నీదృష్టిలో నా విలువ ఎంతో కూడా తెలుసు. అలాంటిది నన్ను ప్రేమిస్తున్నావని ఎలా అనుకుంటాను. నీ కళ్ళల్లోకి చూడ్డానికే భయపడే నేను అంత సాహసం చేశానంటే... దానికి నువ్వేకారణం. నువ్వే నన్ను రెచ్చకొట్టావ్!

నాకు అతి చేరువగా వచ్చావ్! నా గుండెల్ని తాకావ్!.... అది ఆవేశంతో నే కావచ్చు. కానీ... నీపై నాకున్న ఆరాధన, నీ స్పర్శ, వీటన్నింటికి మించిన చీకటి... నేనేం చేస్తున్నానో తెలియనివ్వలేదు. తొందరపడ్డాను. దోషిలా మిగిలిపోయాను.

జరిగిందానికి నేను మనస్ఫూర్తిగా క్షమార్పణ కోరుకుంటున్నాను. ఆ రోజు నాకేమైందో... నిన్ను చూస్తూనే మైమరిచిపోయాను..... ఏదేదో మాట్లాడాను. నిన్ను నేను, నన్ను నువ్వు రెచ్చగొట్టుకున్నాం. ఫలితం... నీ మనసు గాయపడ్డం, నీ మనసులో నా విలువలు మరింత తగ్గడం జరిగిపోయింది.

ఇంతకీ నేను కోరేదేమిటంటే.... నేను కొన్ని పేపర్స్ పంపుతున్నాను. అందులో ఓ యదార్థగాథ దాగుంది. దయచేసి ఓపిగ్గా చదువు. నామీది అసహ్యంతో దాన్ని చదవకుండా చించి పారెయ్యవద్దు.

నేను మంచివాణ్ణని చెప్పుకోవడానిగ్గానీ, నీ నుంచి ఏదో ఆశించిగానీ, ఈ ఉత్తరం రాయడంలేదు. నిస్సహాయస్థితిలో నిన్ను ఒంటరిగా వదిలేసి వచ్చేశానే అన్న బాధ నన్ను కృంగదీస్తోంది. అందుకే ఇది పూర్తిగా చదువు.

ఇంక ముందెప్పుడూ మనం కలవమని మాటిస్తున్నాను..... మనమధ్య వుత్తరాలక్కూడా ఆస్కారంలేదు. అందుకే నేను ఇచ్చిన యడ్రస్ సరైందికాదు. ఇంక ఇంతే........

శలవు,

రమణ

వుత్తరం పూర్తి చేసిన సరయు ఉత్తరంకేసి, పక్కనే పేపర్స్‌కేసి మార్చిమార్చి చూసింది. ఆపై పేపర్స్‌ని చేతుల్లోకి తీసుకుంది.

**(ఇంకా ఉంది)**



## పాల బిస్కట్లు–
## నవ్వుతూ; తుళ్ళుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

బ్రిటానియా

# వ్యక్తిగతం



పశ్చిమ జర్మనీకి చెందిన ప్రముఖ అణు శాస్త్రవేత్త సిమెన్స్ సంస్థ డైరెక్టర్ అయిన కార్ల్ హెయిన్జ్ బెకుర్ట్స్ (56) ని ఇటీవల రెడ్ ఆర్మీ కూటమిలోని మారాకాగోల్ దళం తీవ్రవాదులు దారుణంగా హత్య చేశారు. ఆయన మ్యూనిచ్‌లో ఉన్న తమ కార్యాలయానికి వెళ్తూ ఉండగా 10 కి గ్రా ల బాంబుతో ఆయన ప్రయాణం చేస్తున్న కారుని పేల్చి వేసారు. బెకుర్ట్స్, ఆయన కారు డ్రైవరు అక్కడికక్కడే ప్రాణాలని కోల్పోయారు. గత ఏడాది టర్బయిన్ తయారీ సంస్థ ఎం. టి. యు మానేజింగ్ డైరెక్టర్ ఎర్నెస్ట్ జిమ్మర్‌మాన్‌ని కూడా రెడ్ ఆర్మీ కూటమిలోని, పాట్రిక్ ఓహారా దళం ఆయన ఇంటిలోనే కాల్చి చంపటంతో బెకుర్ట్స్ తమ రక్షణ ఏర్పాట్లని మరింత కట్టుదిట్టం చేసారు ఆయన తమ కారుకి రక్షణ కవచం వంటి తొడుగుని అమర్చుకున్నారు. స్ట్రాస్‌లాహ్‌లోని ఆయన నివాసం కంచుకోటలా ఉంటుంది ఈ రక్షణ ఏర్పాట్లని గమనించిన తీవ్రవాదులు ఆయన వెళ్ళే దారిలో ఒక చెట్టు కింద బాంబుని పెట్టి సరిగా ఆయన కారు అక్కడికి రాగానే దానిని పేల్చివేసారు. రెడ్ ఆర్మీ కూటమి తీవ్రవాదులు బెకుర్ట్స్‌ని గర్వ శత్రువుగా భావించినట్లు తోస్తున్నది ఎందుకంటే వాళ్ళు తమ పోరాటంలో భాగంగా అణుశక్తి పట్ల భయాందోళనలని వ్యక్తం చేసారు బెకుర్ట్స్ అణుశక్తి వినియోగానికి తమ పూర్తి మద్దతు ప్రకటించారు అణుశక్తిని కాదనటం ఒక పారిశ్రామిక దేశానికి కోరి వినాశనం తెచ్చుకోటం వంటిదని ఆయన వాదించారు. రీగన్ నక్షత్రయుద్ధ కార్యక్రమంలోని అణు శాస్త్రజ్ఞులలో బెకుర్ట్స్ కూడా ఉన్నారు.

ఆయన పశ్చిమ జర్మనీలోని ఎన్నో అణు పరిశోధనా సంస్థలలో పనిచేసారు 1980లో ఆయన సిమెన్స్ సంస్థ బోర్డు సభ్యులుగా చేరి మ్యూనిచ్ వెళ్లారు అంతేకాక ప్రొ బెకుర్ట్స్ కార్ల్స్‌రూహ్, హైడల్‌బర్గ్, బాన్ విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులుగా ఉన్నారు. మాక్స్‌ప్లాంక్ ఫిజిక్స్ ఇన్స్టిట్యూట్ గవర్నర్ల బోర్డు అధ్యక్షుడు సిమెన్ సహకారం ఉన్న ఎక్స్‌రే సంస్థ ఫ్రాన్‌హోఫెన్ సొసైటి సెనెట్ సభ్యుడు బాన్, హైడల్‌బర్గ్ విశ్వవిద్యాలయాలు ఈయనకి గౌరవ ఆచార్య బిరుదుని ప్రదానం చేసాయి స్టాక్‌హోంలోని స్వీడిష్ రాయల్ అకాడమి ఆఫ్ ఇంజనీరింగ్ సైన్సెస్ సభ్యుడిగా ఉన్నారు యూరోప్‌లో అణు విచ్ఛిత్తి అంచనాల కోసం యూరోపియన్ కమ్యూనిటిచే నిపుణుల సంఘానికి ఆయన రెండుసార్లు నాయకత్వం వహించారు బెకుర్ట్స్ హత్యవల్ల అంతర్జాతీయ తీవ్రవాద బృందాలు ఒక దానితో మరొకటి సంబంధాలని విస్తృతం చేసుకుంటున్నట్లు మరోసారి స్పష్టమైంది అంతర్జాతీయ తీవ్రవాదం అన్నది ఒక ప్రమాదకరమైన కొత్త రూపాన్ని సంతరించుకుంటున్నట్లు అనిపిస్తున్నది □

# వారఫలం

## 15-8-1986 శుక్రవారం మొదలు 21-8-1986 గురువారం వరకు

★ **మేషం :** ఎన్నో మార్పులు రానున్న సమయం. వారమంతా మీకు అనుకూలం. ఆదాయమున్నది. సభా గౌరవం చేకూరుతుంది. కొందరకు పత్రికా గౌరవం. ఉద్యోగ రీత్యా కొంత ప్రగతి కనిపిస్తుంది. స్త్రీలకు: అవసరాలకు ద్రవ్యం అందటం. ఆరోగ్యాభివృద్ధి

★ **వృషభం :** విలువగల వస్తువులుసేకరించుకో గలరు. వృత్తి యందు పెంపు, అధికారం వృద్ధియగుట, అప్రయత్నంగా ధనాదాయం చేకూరటం,ప్రయాణాల సన్నాహాలు, యిత్యాది సత్ఫలితాలుంటాయి స్త్రీలకు వృత్తియందు వికాసం

★ **మిధునం :** మాటలు చెప్పటంతో, వృధా కాలక్షేపం చేయటంతో దినాలు గడచిపోతే ప్రయోజనం లేదు. కష్టించి పని చేయటం, శ్రమకు తగిన ఫలితాన్ని పొందటం ముఖ్యం రాబడి యందు అభివృద్ధికై ప్రాకులాడవలె.గ్రహానుకూలతగల దినాల్లోనే మేల్కొవలె స్త్రీలకు ఉద్యోగ వికాసం, పరపతి పెరగటం గమనింపదగిన అంశాలు

★ **కర్కాటకం :** మాటల్లో చేతల్లో జాగ్రత్తగా ప్రవర్తించాలి. పరాయి వారు ఏమనుకొంటారో అని గ్రహించి మసలుకోవాలి. మీకు వారమంతా కాకపోయినా చివరి రోజుల్లో ధన రాబడి యున్నది. గౌరవం పెంపొందించే దినాలే మిత్ర సహాయమున్నది. స్త్రీలకు : శుభ కార్యం వాయిదా వేయకండి. శ్రమించి ఎలాగైనా నెరవేర్చుకొండి

★ **సింహం :** మిత్ర సంఘంలో, బంధు వర్గంలో పరిచితుల మధ్య జాగరూకతతో మెలగాలి. ఇష్టం వచ్చినట్లు మాట్లాడరాదు, సంచరించను రాదు. అయివోజ, అంతస్థు పెరిగే కొలది, వినయ లక్షణం కనిపించాలి. స్త్రీలకు : అంతస్థు పెరుగుతుంది. స్థిరాస్థి వృద్ధినందుతుంది

★ **కన్య :** ఎలాగైనా, ఎంతటి శ్రమకైనా ఓర్చి మీ పనులు నియమబద్ధంగా, క్రమబద్ధంగా నెరవేర్చుకోవాలి. ఇరుగు పొరుగు వారిని గమనించి మెలగాలి. వృత్తియందు పెంపు లభ్యమయ్యే వరకు పోరాడాలి. ఇది హితోపదేశం కాదు, గ్రహ గతి మీ ఎట్ల అలాగున్నది. స్త్రీలకు. సర్వత్రా మేలే ఆనందదాయకమైనవారం.

★ **తుల :** సాటి వారితో పోటీకి దిగవలసిన సమయంగాను. 'పట్టినకుందేటికి మూడే కాళ్ళు' అంటూ కూర్చో రాదు. మెలకువతో కార్యాల సాధించుకోవాలి. పని పాటల వారిని గమనించి మెలగాలి. వృత్తియందు జాగ్రత్తతో సంచరించాలి. స్త్రీలకు చికాకులు తొలగుతాయి. సల్పాదాయమున్నది.

★ **వృశ్చికం :** ఆదాయమున్నది అవసరాలు అన్నీ తీరుతాయి ప్రజా రంగంలో పేరు ప్రతిష్ఠలు రానున్నవి. శ్రమించండి. క్రమంగా మీకు అభివృద్ధి దినాలు అభ్యుదయపు రోజులు పుణ్య కార్యాచరణమునకు అవకాశాలుంటాయి స్త్రీలకు వస్తు సేకరణకు. సత్కార్యాచరణమునకు అవకాశాలు.

★ **ధనుస్సు :** ప్రతిభకు దోహదం చేసే గ్రహ స్థితియున్నది. విచ్చలవిడిగా,క్రమబద్ధంగా కార్యాచరణమునకు దిగండి. మీ వృత్తిలో కొంత పెంపు కనిపిస్తుంది. మాటకు విలువ పెరుగుతుంది. సంఘ గౌరవం అభివృద్ధినందుతుంది. స్త్రీలకు. వృత్తియందు పెంపు, ధనలబ్ధి.

★ **మకరం :** నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడటంతో ఒకటి రెండు పనులు చేకూరుతాయి. కొందరు అభివృద్ధి కార్యాలలో పాల్గొనుట జరుగుతుంది. సభా కార్యక్రమానికి కొందరకు ఆస్కారమున్నది. కొందరు కళా రంగాన ప్రతిష్ఠ తెచ్చుకొంటారు. స్త్రీలకు : ఉద్యోగమందు పెంపు చేకూరుతుంది యత్న కార్యసిద్ధి

★ **కుంభం :** అన్ని ప్రయత్నాలు చేసారుగా' శుభ కార్యం చేయగలిగినారా? ప్రస్తుతానికి వాయిదా వేయటమే మేలు. లభించిన కళా సాహితీ రంగావకాశాలు అందకపోవటం కూడా గమనించాలి. సభా గౌరవం, పత్రికా గౌరవం కొందరకు లభ్యం. స్త్రీలకు ధనాదాయమున్నది. వృత్తియందు పెంపు చేకూరుతుంది.

★ **మీనం :** రాజకీయంగా మీకు అభివృద్ధికరమైన వారం. మీ ఎత్తు గడలు కొనసాగుతాయి. సంఘ వ్యవహారాలందు పేరు పెంపులు చేకూరుతాయి. పరులనుండి అందువలసిన డబ్బు సమయానికి అందటం 'వార గ్రహానుకూల్యతయే' అని గ్రహింపగలుగుతారు స్త్రీలకు స్థిరాస్తి పెంపు, కొందరకు వస్త్ర, వాహనానుకూల్యత, ఉద్యోగమందు అభివృద్ధి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ప్రతీ దేహానికీ సరిపోయేది

# టాన్‌టెక్స్®

బ్రీఫ్‌లు

వెస్ట్‌లు

క్యాజువల్స్

పిల్లల దుస్తులు



TTK తయారీ

Imageads-2321

# గాంధీబొమ్మసాక్షిగా..!

'సైడిపాల'

ఈ దేశంలో ఓ రాజకీయ నాయకుడు నెగ్గినందుకో ఓడినందుకో, హత్య చేసినందుకో చెయ్యబడినందుకో పదవి యెక్కినందుకో ఎక్కనరిదుకో, ఇలా సవాలక్ష కారణాలకు సమ్మెలు బంద్‌లు జరుగుతుంటాయి. జరిగి గాంధిగార్ని గుర్తు చేస్తుంటాయి. అలాగే ఆ రోజు కూడా బంద్ జరుగుతోంది. అంతకుముందు రోజు కూడా బందే!

అది పల్లె పట్నంణం కాని వూరు. వచ్చిరాని వయసులో వున్న ఆడపిల్ల ఎబ్బెట్టుగా పైటేసుకొన్నట్టు -అది నాగరికత అవునో కాదో తెలియని స్థితిలో వుందా వూరు. ఆ రోడ్ల మిద కార్లూ బళ్లూ సమంగా తిరుగుతుంటాయి. అబోతులతో పాటు గాలి రౌడిలు కూడా స్వేచ్ఛా విహారం చేస్తుంటారు. గిరి గిసుకున్న ముఠాల స్థావరాల్లా వీధులన్నీ యిరుకుగా మురికిగా వుంటాయి. వాహనాల కింద కుక్కలు పడి చచ్చినంత తేలిగ్గా అక్కడ పట్టపగలే హత్యలు జరుగుతుంటాయి.

ఆ రోజు పూర్తిగా బంద్ జరుగుతుందని ముందే ప్రకటించారు. అన్నట్టుగానే మెడికల్ షాపులూ, తినుబండారాల దుకాణాలు, మిల్స్ హోటల్స్‌తో సహా - అన్ని మూసేసారు. కాదు మూయించారు. సెంటరులో బ్రాంది షాపు మాత్రం తెరిచి వుంచారు. ఆ మధ్యాహ్నం ట్రాక్టర్లతో గొప్ప ఊరేగింపు జరిగింది. నాలుగు రోడ్ల కూడలిలో తగలేస్తున్న గడ్డి బొమ్మలు యింకా రావణకాష్ఠంలా కాలుతూనే వున్నాయి

గాంధి బొమ్మ సెంటర్లో బంద్ నిర్వహిస్తున్న దళానికి నాయకుడు శివుడు. ముప్పయ్యేళ్ల శివుడి పేరు చెపితే ఊరంతా హడలే అతను రాజకీయ నాయకుడు కాని, కాబోయే నాయకుడు కాని కాదు. రాజకీయ నాయకుల చేతుల్లో పావు -మెడలో పాము. అతను తలచుకొంటే పగటిపూట భర్తతో కలిసి వెళ్లే పడుచును నిలేసి మానభంగం చెయ్యగలడని ప్రతీతి. మందు కొడితేనే అతను మృగంలా మారిపోతాడని, అందుకే శివుణ్ని వాళ్ల బాస్ ఎప్పుడూ మందులో స్నానం చేయిస్తుంటాడనీ ప్రజావాక్యం.

వాళ్ల బాస్ పేరేదయితేనేం ఈ దేశంలోని రాజకీయ నాయకుల్లో ఆయనొకడు. బాస్ ఆదేశం మేరకు శివుడు స్ట్రిక్టుగా బంద్ అములు జరిపిస్తూ తన శిష్య బృందంతో చిందులు తొక్కుతున్నాడు. షాపులు మూసేసి ముందు కూర్చున్న యజమానులను, మధ్యాహ్నం పూట బంద్ అంత తేలికగా వుండదని సగం సగం షట్టర్స్ తెరిచిన వాళ్లనీ శివుడు కఠినంగా హెచ్చరిస్తున్నాడు. ఏ మూల ఏ కిళ్లీబడ్డీ తెరిచినా, ఏ అరుగుమీద ఏ చిన్న కిరాణా దుకాణం తెరిచినా - కనిపెట్టి ప్రతాపం ప్రదర్శించి వస్తున్న అనుయాయుల్ని అభినందిస్తున్నాడు.

"గురూ, మాధవి కాన్వేంటు క్లోజ్ చెయ్యలేదు. ప్రిన్సిపాల్‌తో చెపితే పిల్లలకు స్ట్రయిక్ ఏమిటని గిరగా సమాధానం చెప్పింది." గుండెలు కనిపించేలా షర్ట్‌కి పై నాలుగు గుండీలు విప్పేసిన కుర్రాడు హడావిడిగా సైకిలు దిగుతూనే చెప్పాడు.

"నన్ను రమ్మన్నావా?" శివుడి మాటలు ముద్దగా వున్నాయి.

"నీ వరకూ రానిస్తామా గురూ? నేనే లాంగ్‌బెల్ కొట్టేసి క్లాసుల్లోకి వెళ్లి పిల్లల్ని పొమ్మన్నాను. కాన్వేంటు లోపలకు వెళ్లడం యిదే మొదటిసారి. టీచర్సంతా అమ్మాయిలే పిట ఎట లాడిపోతున్నారు.

"తప్పారే. ఈ రోజు పాడు మాటలు చెప్పకు. దేశం కోసం దీక్షగా బంద్ చేయిస్తున్నామంటే చాలా పవిత్రమైన రోజు ... ఆఁ - నీ సంగతేవిట్రా నాగూ?" సానికి కూడా కొన్ని నియమాలున్నట్లు ఆ రోజు అమ్మాయిల ప్రసక్తి కిట్టని శివుణ్ని చూసి శిష్యులంతా ఆశ్చర్యపోయారు.

'ఇంటింటికి తిరిగి ఆ నల్లోడు సోడాలమ్మేస్తున్నాడు గురూ. మర్యాదగా చెపితే మానలేదు. ఓ అరడజను సోడా బుడ్లు తీసి పగలగొట్టేసరికి లెంపలేసుకొని బుద్ధిగా బండి తోసుకొని యింటికెళ్లిపోయాడు" చారల బనియనుతో బక్కపల్చగా వున్న నాగులు 'బ్రూస్‌లీ' పోజులో తన సాహసాన్ని వివరించాడు.

"సెభాష్" మెచ్చుకున్నాడు శివుడు.

శివుడి చుట్టూ మూగిన గాంగ్‌లో మరెవరో నోరు విప్పబోయారు. ఇంతలో భుజాన కావిడి వేసుకొని కూరగాయలమ్ముకొంటున్న ఓ ముసలాణ్ని లాక్కొచ్చి శివుడి ముందు నిలేశాడు రంగడు - హైస్కూలులో చదువుతున్న కుర్రాడు.

"చూడు గురూ, ఈ పోటుగాడు మెల్లగా సందుల్లో యాపారం చేసేస్తున్నాడు". దొంగను పట్టుకొన్న పోలీసులా ఫిర్యాదు చేశాడు రంగడు.

ఎరా, ముసలి నాయాలా - ఏంటి నీ కత?" శివుడి కళ్లు చూసి ముసిలాడు వణికిపోతున్నాడు. బదులు చెప్పలేక తడబడిపోతున్నాడు.

ఈ రోజు బంద్ అని తెలవదా" కావిడ మీద చెయ్యేసి అడిగాడు శివుడు.

"తెలుసు బాబూ. కొనుక్కొచ్చిన కూరగాయలు పాడయి పోతాయని ..."

"మిగతా వాళ్లకు నిమాత్రం తెలివితేటల్లేకే దుకాణాలు మూసేశార్రా ముసలి నా కొడకా! నీలాంటి యెదవలుండబట్టే దేశం యిలా పాడయిపోతోంది. సరే చెంన యెదవ పనికి చెంపలేసుకొని తిన్నగా యింటికి పో"

"సెత్తెం బాబయ్యా ... అలాగె పోతాను" ముసిలాడు వెనుతిరిగాడు.

"ఈణ్ని యిలా వదిలేస్తే యెక్కడో కక్కుర్తి పడతాడు గురూ". అంటూ పరోపితంగా తట్టమిద ఓ తన్ను తన్నాడు రంగడు. కూరగాయలు యెగిరిపడి చెంపరపంపరగా దుమ్ములో కలిసిపోయాయి.

"బాబూ ... బాబూ .." అంటూ ముసలాడు వాటిని ఏరుకోబోతుంటగా నాగులు రెండో తట్ట మిద కూడా తన్నాడు. మొత్తం కూరగాయలన్ని నేలపాలయ్యాయి. ఆ గుంపంతా పగలబడ నవ్వారు. ముసిలాడు ఖాళీ కావిడ భుజం మిద పెట్టుకొని గుడ్ల నీరు కుక్కుకుంటూ కాళ్లీడ్చుకుంటూ కదిలాడు.

ఇంతలో మరో కుర్రాడొచ్చి "అగ్రహారంలో ఓ ఆడమనిషి అరటిపళ్లమ్మేసుకొంటోంది గురూ అన్నాడు

అతదాన్ని ఆపు చెయ్యలేక వార్త చెప్పడానికొచ్చావురా మొగాడివి? నేను పడ్తాను దాని పని నడు చూపిందు' రంగడు హుషారుగా సైకిలెక్కాడు. రంగణ్ని మరో యిద్దరు కుర్రాళ్లు అనుసరించారు.

విజయపరంపరతో ఒళ్లు తెలియని శివుడు పక్కనే వున్న బ్రాందిషాపులోకి వెళ్లి మరో క్వార్టరు లాగిస్తున్నాడు లాస్టు రవుండ్‌లో వున్న శివుడి చెవిలో యేదో చెప్పి నాగులు బయటకు లాక్కెళ్లాడు

ఓ ఒంటెద్దు బండిని. దాని పక్కనే తలపాగ చుట్టుకొన్న బక్క మనిషిని కుర్రాళ్లు నిలబెట్టి గొడవ చేస్తున్నారు. శివుడు రాగానే అంతా దారిచ్చి నిలబడ్డారు.

"బండెక్కడికిరా బక్క లంజా కొడకా?"

"కోలవిధికండి. ఈ రెండ్రోజులుగా పనిలేక మాడిపోతున్నాం బాబూ. అదురుట్టం కొద్దీ ఆ పంతులుగారొచ్చి పని సెప్పారు. ఈ తలుపు సెక్కలు అక్కడికి సేరిత్తే అయిదు రూపాయలిత్తానన్నారు. బక్కోణ్ణి. నన్ను దయదలని పోనివ్వండి"

"ఈ రెండ్రోజుల్నుంచి నువ్వు తప్ప మేమంతా తినేసి సుఖపడిపోతున్నామంటావా? నా మట్టుకు నేను పొద్దున లేచి తీర్థం తప్ప మరేం తీసుకోలేదు. దేశం కోసం ఈ మాత్రం చెయ్యకపోతే యెందుకురా దొంగ నాయాల్లారా. పో ... వెనక్కు పో"

"బాబూ ... మి కాళ్లట్టుకొంటా ..." అని

ప్రాధేయపడుతున్న ముసిలాడికి చుట్టూ కాల్చుకొంటూ వస్తున్న కానిస్టేబులు గవర్రాజు దేవుడిలా కనిపించాడు. కాని గవర్రాజు వస్తూనే శివుడికి శాల్యూట్ చేసాడు.

"సూడండి పోలీసుబాబూ. నన్నీళ్ళు కవలనియ్యడంలేదు"

"బంద్ కదా తాతా. శివుడిగారికెదురు చెప్పకు. ఆయనకు కోపమొస్తుంది. వెళ్ళు. వెనక్కి పో" అని గవర్రాజు సలహా యిచ్చాడు.

"ఏవిటి గవర్రాజుగారూ. దేశమంతా బందో బందో అంటుంటే మీరు మందో మందో అని బయల్దేరారు. బందొబస్తు లేదా?" శివుడు మందు నవ్వు చూసి కుందేలయిపోయాడు గవర్రాజు.

"మీకు తెలియనిదేముంది బాబూ? అలవాటుపడిన ప్రాణం. వస్తాను సార్." గవర్రాజు బ్రాంది షాపులో దూరాడు.

శివుడు ముసిలాడికేసి తీక్షణంగా చూశాడు. ఆ చూపు అతణ్ని భస్మం చేసేలా వుంది.

"ఏరా బక్క నా కొడకా. పోలీసాయనకు కంప్లైంట్ చేస్తావురా? నీకెన్ని దమ్ములురా? నీకు నేను చెపుతాను బుద్ధి" తలుపు చెక్క ఒకటి తీసి విష్ణు బొమ్మలు కాలుతున్న మంటల్లోకి విసిరాడు శివుడు. మరోటి తియ్యబోతుండగా ముసలాడు అడ్డుపడ్డాడు. శివుడు రెచ్చిపోయి ముసలాడి ఒళ్ళు హూనమయ్యేలా చితక్కొట్టాడు.

"నీ దిక్కున్నకాడికి చెప్పుకోరా" అంటూ చెక్కలన్నీ మంటల్లోకి విసిరేసి, ఎద్దుని విప్పేసి బండి విరిగేలా ఒక్క తన్ను తన్నాడు. కోపం చాలక ముసలాణ్ని కూడా బలంగా తన్నాడు. ఆ తాపుకి వెల్లకిలా పడిన ముసలాడి తల గాంధీ బొమ్మకి తగిలి రక్తం చిమ్మింది. ...

"దాన్ని నోరు మూయించాను గురూ" అంటూ విజయగర్వంతో అప్పుడే సైకిలు మీద వచ్చి వాలిన రంగడు గాంధీ బొమ్మ దగ్గర స్పృహతప్పి పడిపోయిన ముసలాణ్ని చూసి 'తాతా' అంటూ గొల్లుమన్నాడు.

"మా తాత ... రాజులు తాత ... ఊపిరి ఆడుతున్నట్టు లేదు. మా తాతకేం జరిగింది? హాస్పిటలుకు తీసుకెళ్ళాలి" అంటూ ఆదుర్దాపడుతున్నాడు రంగడు. కనుచూపుమేరలో ఏ వాహనం లేదు - విరిగిన ఒంటెద్దు బండి తప్ప! □



పి. ఎన్. ఆర్. చేబ్రోలు

★ సినీతారలపట్ల వ్యామోహం వెర్రితలలు వేస్తున్న ఈ రోజులలో సినీ వార్తలు పత్రికలు ప్రచురిస్తూనే వున్నాయి యింకా ప్రత్యేకం సినిమా పత్రికలు అవసరమా?

● అవే కావాలి అవే కొంటారు కూడా పత్రికలదేముంది- పక్కవాడి దగ్గర బారో చేసి చదివిచ్చేయవచ్చు"

పి. వి. ఎస్. కె. హనుమాన్ జంక్షన్

★ క్లాసురూంలో నిద్రపోయే టీచర్లపై మీ అభిప్రాయం!

● ఇది వరకైతే యింటి దగ్గర ట్యూషన్ల చెడప- అనుకునేదాన్ని- మరిప్పుడు- చెప్పలేకుండా వున్నా!

సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ భార్యాభర్తలు యిద్దరూ ఉద్యోగాలు చేస్తూంటే వారికి వచ్చే సాధక బాధకాలేమిటి?

● భార్యలకి బాధకాలు. భర్తలకి సాధకాలు ఎక్కువ! అంతే ఎందుకంటారా? 9 టు 5 ఉద్యోగం చేసి వచ్చినా భార్యకి యింట్లో చాకిరి తప్పదు భర్తకి భారమూ పెరగదు. కాని యిద్దరూ ఉద్యోగస్తులైతే అన్నది చదువుతూ ఉంటే- అంతా సవ్యంగా వుంది. కాస్త కాస్త ఎడ్జెస్టుమెంట్లతో చిలకా గోరింకల్లా కాపురాలు సాగించేస్తున్నాం




...ముఖ్యశక్యం కాకుండా ఉంటుంది' (మన గవర్నమెంటువారి పద్ధతిలాగ)

ఎస్. ఎస్. ఆర్; కడప

★ ఒక సగటు ఆడ మనిషి పడే బాధలలో సహస్రాంశమేనా అనుభవించని మీరు (ఐయామ్ డామ్ షూర్ ఆఫ్ యిట్) ఆడదాని కష్టాలను విశ్లేషించడం ఓ గొప్ప హిపోక్రసి అంటే ఆత్మవంచన

● చిత్రం. మీరంత 'డామ్ షూర్'గా చెప్పేస్తుంటే- నేనేం చెయ్యను? నేనేం టాటా బిర్లాల సంతతిననుకుంటున్నారా" సాదా సీదా క్లార్కుగారి కూతుర్ని. కష్టపడి జీతం కట్టడానికబ్బంది పడి చదువుకున్నదాన్ని దానికి సాక్ష్యం నా స్నేహితులే వున్నారు- అందుకే నేనంటే వారికిప్పటికీ యింత యిష్టం చదువుకుంటూ ట్యూషన్లు చెప్పాను ఉద్యోగం చేస్తూ నా అన్న వాళ్ళని చదివించి మనిషిని చేశాను నాకిష్టమైన వ్యక్తిని 'డబ్బుందని' ప్రేమించి పెళ్ళి చేసుకోలేదు యిద్దరికి కష్టాలంటే భయం లేదు కనుకే చేరికయ్యాం ఇప్పుడు అంతా మెచ్చే రామలక్ష్మి వెనుక ధైర్య సాహసాల కథ వుంది నవ్వుతూ గంజి తాగడం కూడ నేర్పగల్గాను నా ఎల్లలకి నవ్వుతూ అందలమూ ఎక్కించ కల్గాను నేను కష్టానికి- సుఖానికి చలించిపోను నా భయం లేని తనం నాకు శ్రీరామరక్ష అంచేత సాదా ...ద కబుర్లు వద్దు

...స. ఆర్. ఆర్; ఖర్గపూర్

★ అంతస్తుకై ప్రాకులాడి, అది పొంది కూడా ...డే వాళ్ళను ఏమనాలి?

● ఎందుకూ ఏమైనా అనడం? వాళ్ళలా ... అంత ... కొంటుంటారు ... లేదే"

ఎస్. వి; వడ్లమూడి

★ నేను ఇందిరను కావాలంటే పేరు మార్చుకోమన్నారు నేనావిడనొక ఆదర్శమూర్తిగా తీసుకోదలచానని కాని మీరు స్వల్పంగా ఆలోచిస్తారనుకోలేదు.

● నేను వాస్తవానికి దగ్గిరగా ఆలోచిస్తాను-అంచేత సులభ పద్ధతి చెప్పాను దానికేముంది రంగంలోకి దిగండి- ఎవరొద్దంటున్నారు మిమ్మల్ని? ఇందిరని ఎడ్మయిర్ చేయని వారు లేరు. మీరొక్కరే అనుకుంటేనే- చిక్కు! □

# క్లినిక్ స్పెషల్ షాంపూతో మీ తలచుండును తరమవచ్చు. సభికుల్ని ముగ్ధుల్ని చేయవచ్చు.

చుండు బాధ కారణంగా మీరు సభికుల్ని ముగ్ధుల్ని చేయలేక పోతుంటే, మీరు స్పెషలిస్టు షాంపూతో తలస్నానం చెయ్యవలసిన సమయం వచ్చిందన్నమాట. క్లినిక్ స్పెషల్ షాంపూలోని మృదువైననురగ మీ జుట్టును శుభ్రం చేస్తుండగానే, దీనిలోని ఒక ప్రత్యేక పదార్థం మీ చుండును అదుపులోకి తెస్తుంది. ఆ దురద పోగొట్టి, మీ వెంట్రుకల్ని గొప్పగా కనిపించేలా శుభ్రంగా, ఆరోగ్యవంతంగా ఉంచుతుంది.

# క్లినిక్ స్పెషల్
## షాంపూ

**చుండులేని శుభ్రమైన, ఆరోగ్యవంతమైన జుట్టుకోసం.**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.




HLL-2607

సీరియల్: నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

సాయంత్రం అయిదు గంటలయింది.

రేణుక భగవద్గీతలోని శ్లోకాలూ వాటి అర్థాలూ తాత్పర్యాలూ అనసూయమ్మకి చదివి వినిపిస్తోంది.

"యోగ యుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః సర్వ భూతాత్మ భూతాత్మ కుర్వన్నపి న లిప్యతే."

నిష్కామ కర్మ యోగనిష్ఠ గలవాడునూ విశుద్ధాంతఃకరణుడును, స్వాధీనమందున్న దేహేంద్రియములు గలవాడునూ బ్రహ్మాదిస్తంభ పర్యంతము గల సమస్త భూతములకు ఆత్మ భూతమైన ప్రత్యగాత్మ గలవాడునూ అగు మనుజుడు లోక సంగ్రహార్థము కర్మల నాచరించినప్పటికి వాని ఫలితముగ సంసార బంధమున బడడు!"

అదే సమయానికి రమా, రఘు బజారు నుంచి వచ్చారు. చేతిలో వున్న పాకెట్లుని సోఫాలో పడేసి చప్పట్లు కొట్టింది రమ.

వెనక్కి తిరిగి ఆ అన్నాచెల్లెళ్లను చూసి చివాల్న లేచి నిలబడింది రేణుక. చికాగ్గా చూసారు అనసూయమ్మ.

"శభాష్! ఒకరికి మరొకరు తోడయ్యారు!"

వెటకారం చేసింది రమ.

"ఏమీ తోచక అమ్మగారు చదవమంటే...." ఏదో చెప్పబోయింది రేణుక.

"అమ్మగారు చదవమంటే ఈ అమ్మగారు గీతాపారాయణంలోకి దిగారన్న మాట! అందులోకి మంచి అధ్యాయమే దొరికింది! కర్మ సన్యాసయోగం!" అంటూ గమ్మత్తుగా చేతులూ, కళ్ళూ తిప్పింది రమ.

"ఏవిటే! ఆ వెటకారం!" కూతురిపై కోప్పడింది తల్లి.

"నా అభిప్రాయం ప్రకారం గీతాపారాయణానికి ఓ వయసంటూ వుందమ్మా! నాకూ రేణూకి కర్మలూ సన్యాసాలూ ఏం తెలుస్తాయి చెప్పు! అర్థం అవుతాయా! ఒకవేళ అర్థం చేసుకొన్నా అవి మాలాంటి వాళ్లకి ఆచరణ సాధ్యమేనంటావా?"

జరిగిన కథ- 1: డాక్టర్ ధర్మరాజు గారూ, మున్సిపల్ హైస్కూల్ హెడ్మాష్టరు విశ్వనాథంగారూ విశాఖపట్నంలో ఒకే ఇంట్లో అద్దెకుండేవారు. డాక్టరు గారి భార్య అనసూయమ్మ. డాక్టరుగారికిద్దరు సంతానం. మాష్టారికి ముగ్గురు పిల్లలు. మాష్టారిగారి పెద్దబ్బాయి శంకరమూ డాక్టరుగారి అబ్బాయి రఘూ ఒకే ఈడువారు. డాక్టరుగారి అమ్మాయి రమ, మాష్టారుగారమ్మాయి రేణుక ఒకే వయస్సు పిల్లలు. డాక్టరుగారికి హైదరాబాద్‌కి బదిలీ అయి వెళ్లి పదేళ్లయింది. రేణుకకి టెలిఫోన్ ఆపరేటర్ ఉద్యోగానికి యింటర్వ్యూ వస్తే హైదరాబాద్‌లోని డాక్టరుగారింటికి వచ్చింది. డాక్టరుగారు చనిపోయి నాలుగేళ్లయిందని తెల్సుకున్న రేణుక బాధపడింది. శంకరం ఏక్సిడెంట్‌లో చనిపోయాడని తెలుసుకొని బాధపడ్డాడు రఘు. రేణుకకి ట్రైనింగ్ అయిపోయి హైదరాబాద్‌లోనే ఉద్యోగం రావడంతో తను వేరుగా అద్దె ఇంట్లోకి వెళ్లిపోయింది.

లాలనగా తల్లిని సమీపించింది రమ.

"ఇదమ్మా రేణూ! చదవమంటే అది చదవదు! మరొకరు చదివితే వెటకారం పట్టిస్తుంది. నాకు కనపడి చావదు! కళ్లజోడు అస్తమానం మార్చలేక విసుగెత్తి ఊరుకొన్నా! ఊఁ ఈ పూటకి చాల్లే!" అంటూ లేచారు అనసూయమ్మ.

ఆటో రిక్షాలోంచి రెండు బుట్టలు తెచ్చి లోపల పెట్టాడు రఘు.

"ఏవిట్రా రఘూ! ఆ బుట్టలన్నీ దీపావళి బాణా సంచాయే! మరి చిన్నపిల్లలై పోతున్నార్రా?"

రేణుక వైపే చూస్తున్న రఘు తల్లి ప్రశ్నకి పరాగ్గా సమాధానం యిచ్చాడు.

'అవునమ్మా!'

"అవునేవిట్రా? అంత సామానెందుకు? డబ్బు దండగ!"

'ఎంతో కాదమ్మా! నూట పది రూపాయలు!" సర్ది చెప్పింది రమ.

"నేను దెబ్బ లాడ్తానని అలా అంటున్నారు! ఏ రెండు వందల రూపాయలో వుంటాయ్!" నమ్మలేదు అనసూయమ్మ.

"అవునమ్మా! సరిగా అంతే!" అంటూ మేడ మెట్లెక్కి తన గదిలోకి పోతూ చెప్పాడు రఘు. రఘు మీదకి వెళ్లడంతో కొంత ఫ్రీనెస్ ఫీలయింది రేణుక.

సోఫాలో పడేసిన పాకెట్లని తీసి విప్పింది రమ. రెండు చీరల్ని బయటకు తీసింది

ఎలా వున్నాయ్? రేణూ! చూడమ్మా బావున్నాయా?" ఆ యిద్దరి అభిప్రాయాన్ని అడిగింది రమ హుషారుగా. ఒక చీరని అందుకొంది రేణు. మడత విప్పి తన వంటి మీద వేసుకొని

చాలా బావుంది రమా! నీ వంటి మీద ఈ చీర కెంతందం వస్తుందో తెల్సా?" అంది.

'ఏం? నీకు మాత్రం బావుండదా?" ఎదురు ప్రశ్న వేసింది రమ. రేణుక మాట్లాడలేదు. చీరను చూస్తూ వుండిపోయింది.

సోఫాలో పడి వున్న రెండో చీరను చేతిలోకి తీసుకొన్నారు అనసూయమ్మ పరీక్షగా చూసి—

"రెండూ ఒక్క లాగే వున్నాయేవిటే రమా! చూసుకోలేదా" అడిగారు కూతుర్ని

ఒక్కలాగే వుండడం కాదమ్మా ఒకటే డిజైన్!" చెప్పింది రమ

'మరో డిజైన్ తీసుకోలేక పోయావా?' అడిగింది రేణు.

"తీసుకోవాలనే తీసుకొన్నా! మనిద్దరమూ ఒకే డిజైన్ గల చీరలు కట్టుకొని తిరుగుతూంటే చూసేవాళ్లకి కళ్లు తిరగాలి!"

"నాకా? అంత కాస్ట్లీది నాకెందుకు రమా?' ఆశ్చర్యపోతూ అసమ్మతిని తెలియజేసింది రేణు.

రేణుక కూడా చీర కొన్నందుకు సంతోషించారు అనసూయమ్మ.

ఖరీదెంతో లేదోయ్! ఒన్ టూ హండ్రెడ్ రూపీస్! ఎలా వుందో చెప్పావు కాదు!" తెలిగ్గా అడిగింది రమ

నీ సెలక్షన్ బ్రహ్మాండం రమా! కాని ...'

"నో నో! ఇది నా సెలక్షన్ కాదు! అన్నయ్య బావుందన్నాడు తీసుకొన్నా! అంతే!"

"సారి రమా! ఆ శారీ నాకొద్దు!" ఖండితంగా అంది రేణు. రమ చిన్నబుచ్చుకుంది.

"ఏం? ఖరీదెక్కువని అలా అంటున్నావా? లేక నిజంగా నీకు చీర అవసరం లేదా?" సూటిగా చూస్తూ అడిగింది రమ.

జవాబీయలేదు రేణు. అనసూయమ్మగారు కలుగజేసుకొన్నారు.

"అవసరం లేకపోవడమేమిటే! కొత్తగా నాలుగు చీరలొస్తే వుంది. కాకపోతే ఖరీదెక్కువని ఆలోచిస్తోంది!' సర్ది చెప్పబోయారు.

"ఖరీదు పే చేయమని అడగలేదే! దీపావళికి నేనెలాగూ కొనుక్కొంటున్నా' నీకూ బావుంటుందని అనుకొన్నాం! కొన్నాం!" విడమరచి చెప్పింది రమ మౌనాన్ని వీడలేదు రేణు.

"అవును రేణూ! మీరిద్దరూ ఆ చీరలు కట్టుకొని తిరుగుతూంటె చూసేవాళ్ల కళ్లు కుట్టుకొంటాయ్! మంచి చీర ఒక్కటీ లేదు!వుద్యోగస్థురాలివి! పైగా పెళ్లి కాని పిల్లవి! నలుగురి మధ్యా తిరుగుతూంటావ్!హుందాగా కన్పించాలి!"

నచ్చచెప్పబోయారు అనసూయమ్మ రేణు కాదనలేకపోయింది కృతజ్ఞతతో మెరిసాయ్ ఆమె కళ్లు.

జీతాలు అందిన రోజున వారింటికి వెళ్లింది రేణు. అనసూయమ్మగారు ఒంటరిగా వుండటం చూసి, డబ్బు అందిస్తూ

"ఈ నెలకి చీర బాపతు ఈ యాభై తీసుకోమనండి' వచ్చే నెల్లో తక్కన డబ్బిస్తా!" అంది.

డబ్బు తీసుకోకుండా ఆమె తన వైపే చూస్తూంటే అంది రేణు–

"నాన్నగారికి | మందులు కొనాలని తమ్ముడు వుత్తరం రాసాడు కొంచెం ఎక్కువ పంపించాల్సి వచ్చింది. సగం డబ్బైనా యివ్వాలనుకొన్నా' కానీ కుదురలేదు! ఏమనుకోకండి!" బ్రతిమాలింది.

"ఓసి వెర్రిదానా! నీవిచ్చినా మేం తీసుకొంటామనుకొన్నావా? నీవూ నా కూతురులాంటి దానివే' రమతో బాటు నీకూ కొన్నాం' ఖరీదు చెల్లించనవసరం లేదమ్మా!! ఈ డబ్బు కూడా మీ తమ్ముడికి పంపించు పాపం వాళ్లక్కడ ఏమవస్తలు పడుతున్నారో!" అంటూ అక్కడ నుంచి నిష్క్రమించారు అనసూయమ్మ. నిశ్చేష్టురాలైంది రేణు.

★ ★ ★ ★

మెయిన్ గేటు తెరుచుకొని లోనికి వస్తూ మేడ మీదకి చూసారు రామనాధంగారు. పైన లైట్లు లేకపోవడంతో "రఘు యింకా రాలేదు కాబోలు' అనుకొన్నారు.

'రా అన్నయ్యా' చాలా రోజులకి!'

అన్నయ్యని నిష్ఠురంగానూ, ఆప్యాయంగానూ ఆహ్వానించారు అనసూయమ్మ

'అదేవిటమ్మా' మొన్న ఆరో తారీఖునే కదా వచ్చాను' ఇరవైమూడు రోజులైంది!" అంటూ సోఫాలో ఆశీనులయ్యారు రామనాధంగారు ఎదురుగా కుర్చీలో చెల్లెలు కూర్చొంటూంటే అన్నారు.

'రఘుబాబు యింకా రాలేదులా వుంది!"

"వాడిప్పుడే రాడురా!"

ఈవేళ ఆదివారం కదా! వుంటాడనుకొన్నా!"

"ఈ రోజు వాళ్ల యింజనీరు గారికి షష్టిపూర్తట! ఉదయమే వెళ్లాడు. ఎప్పుడొస్తాడో తెలీదు!" చెప్పారు అనసూయమ్మ.

"నేనొస్తానని పొద్దుటే ఫోను చేసి చెప్పానే' అప్పుడు ఈ విషయం చెప్పలేదు!" ఉసూరుమన్నారు రామనాధంగారు.

"ఏం? వాడితో పనుందా?"

మాట్లాడలేదు రామనాధంగారు.

'ఏదైనా కాంట్రాక్టు విషయం మాట్లాడాలా?" మళ్లీ అడిగారు అనసూయమ్మ.

పకాల్న నవ్వారు రామనాధంగారు.

"నా మేనల్లుడు నాకు కాంట్రాక్టు దక్కనిస్తాడుటమ్మా? అని ఆగి,

"ఇది ఒక కాంట్రాక్టు లాంటిదె అనుకో! అన్నట్లు రమ కనబడదేం? అది వెళ్లిందా అన్నయ్యతో!" అడిగారు అటూ యిటూ చూస్తూ

"లేదు! సినిమా కెళ్లింది!"

"ఒక్కర్తేనా?"

"అదీ, దాని ఫ్రెండూ వెళ్లారు!"

"ఫ్రెండంటే ఆ అమ్మాయేనా? టెలిఫోన్ ఆఫీసులో పని చేస్తోంది?" నాన్న అడిగారు.

"ఆ అమ్మాయి కాదురా' డాక్టరు గారమ్మాయితో వెళ్లింది. ఆ అమ్మాయి కదో పిచ్చి! కొత్త సినిమా రాగానే వెళ్లాలంటుంది! దీన్ని ప్రయాణం చేస్తుంది



# నిశ్శబ్ద సంగీతం

తోడు కోసం! ఆ టెలిఫోన్ అమ్మాయికి సినిమా పిచ్చి లేదు!"

"పోనిద్దూ చిన్నపిల్లలు! వాళ్ల సరదాలు వాళ్లవి! రేపు పెళ్లయ్యాక వాళ్లే వెళ్లమంటారు!"

"ఏమిటో అన్నయ్యా! దాని పెళ్లి ఎలా చెయ్యటమో అర్థం కావటం లేదు! నీవైనా సంబంధాలు చూడవ్!"

నిట్టూర్చారు అనసూయమ్మ.

"నా కూతురికి మేనరికం రెడీగా వుంది! చేయగలిగానా" దేనికైనా సమయం కల్సి రావాలమ్మా! నిన్నరాత్రి నీ ఒదిన నా మీద యుద్ధం ప్రకటించిందనుకో!"

తానొచ్చిన విషయం చెప్పడానికి నాంది పలికారు రామనాథంగారు.

"యుద్ధమా? ఛ ఛ నేన్నమ్మను! ఒదిన అలాంటిది కాదు!' అపనమ్మకాన్ని ప్రకటించారు అనసూయమ్మ.

'నీవేకాదు ఎవ్వరూ నమ్మరు! ఉషకి పెళ్లి చేయలేదని నామీద విరుచుకు పడింది అందుకే అర్జంటుగా యిలా పరుగెత్తుకొని వచ్చా! రమ పెళ్లి మన రఘుబాబు పెళ్లితో ముడిపెడితే లాభం లేదు ముందు ఉషని రఘుకిచ్చి పెళ్లి చేసేద్దాం! లేకపోతే నాకు మనశ్శాంతి వుండదు!" చెప్పాల్సింది చెప్పారు.

"అలాగే చేద్దాం! రఘుబాబుని కూడా ఒక్క మాట అడిగి చెల్లెలు మాటలకి నివ్వెర పోయారు రామనాథం గారు.

"ఏమిటమ్మా కొత్తగా మాట్లాడుతున్నావ్! వాడు నీ మాట కాదంటాడా? ఉష పుట్టినప్పటి నుంచి వాడి పెళ్లామే అని అనుకొంటున్నాం కదా!' అడిగారు కంగారుపడుతూ

నా మాట కాదంటాడని నేననుకోవటం లేదురా! అయినా వాడితో చెప్పకుండా మనం పెళ్లి ప్రయత్నం చేయటం బావుండదు!

ఆమె మాటలకి మరోసారి షాక్ తిన్నారు రామనాథం గారు

ఏమిటో అనసూయ వింతగా మాట్లాడుతోంది!' అనుమానంగా చెల్లెలు కళ్లలోకి చూసారు.

పెళ్లి నిశ్చయం చేస్తున్నట్టు వాడితో చెప్పాలి! అది నా అభిప్రాయం!' చెల్లెలు యిచ్చిన వివరణ రామనాథంగారి మనసును తేలిక పర్చింది

అలాగే! వాడితో చెప్పే ముహూర్తం పెట్టుకొందాం!' అంటూ లేచారు.

అదేమిటిలా వచ్చి అలా వెళ్లి పోతున్నావ్! ఓ గంటలో పిల్లలొస్తారు. భోజనం చేసి వెళ్లొచ్చు!" అన్నారు తాను కూడా లేస్తూ

భోజనమా? మంచి నీళ్లు తాగడానిక్కూడా తీరిక లేదంటే నమ్ము! వచ్చే మార్చి ఆఖరికి పనులన్నీ అయిపోవాలి! నేవస్తానమ్మా!

అన్నయ్య వెనుకనే వీధి వరండావరకు వెళ్లారు అనసూయమ్మ. అప్పటికే గేటు తెరచుకొని లోనికి వస్తూ కన్పించింది రేణు.

ఆమె దగ్గరకు రాగానే–

"రావమ్మా! రేణూ! ఏమిటి తొచటం లేదు!" పలకరించారు. ఇద్దరూ హాల్లో సోఫాలో కూర్చున్నారు

"రమ యింట్లో లేదాండి?" అడిగింది రేణు.

"ఏదో కొత్త సినిమా వచ్చిందట! డాక్టరు గారమ్మాయి వచ్చి దీన్ని లాక్కుపోయింది!"

"మీ ఆరోగ్యం ఎలా వుందండి?"

నిట్టూర్చారు అనసూయమ్మ.

"ఏమిటి బాగుండటం లేదమ్మా! నాలుగడుగులు వేస్తే నీర్సం, గుండె దడ! ఏ రోగమూ లేదు, బాగా రెస్టు తీసుకోండంటారు డాక్టరు గారు. నాకు రెస్టు తప్పించి ఏం పని వుంది చెప్పు! ఏదో టానిక్కూ టాబ్లెట్లూ రాసాడు! వారం రోజుల నుంచీ వాడుతున్నా! గుణం కనబడ్డం లేదు!"

చివాల్న లేచి ఎదురుగా టేబిలు మీదున్న టానిక్కు సీసాను చేతిలోకి తీసుకొని చూసింది రేణు.

'ఇదేనా మీరు వారం రోజుల నుంచీ వాడుతున్నది?" అడిగింది.

'అవునమ్మా! అదే!"

కిలకిలా నవ్వింది రేణు

'వారం రోజుల నుంచి వాడుతున్నా నంటున్నారు! రెండు మూడు చెంచాలు కూడా వాడినట్టు లేదు!" తేల్చి అడిగింది.

జవాబుగా చిరునవ్వు నవ్వారు అనసూయమ్మ.

"ఏమిటో నమ్మా! ఈ మందులు వాడటం అంటే నాకు బద్ధకం! అసలు యిష్టం వుండదంటే నమ్ము! ఇంత వయసు వచ్చినా యింతవరకూ ఏ మందూ వాడి ఎరుగను! బలవంతంగా డాక్టరు దగ్గరకి లాక్కెళ్లాడు రఘు. వాడేదో రాసాడు! వీడు కొని పడేసాడు!"

"కాని మీరు మాత్రం వాడటం లేదు! అందుకొంది. ఒక చెంచాడు తీసి ఆమె నోట్లో పోసింది ఆమె గుటక వేయగానే అడిగింది.. .

'చేదుగా వుందాండి?'

"తియ్యగానే వుందనుకో!" అన్నారు.

టానిక్ సీసాను టేబిలు మీద వుంచి టాబ్లెట్సు అందించింది.

"టైం ప్రకారం మందులు వేసుకోకుండా డాక్టరుని నిందించి ప్రయోజనం లేదండి! వారం రోజులు వాడండి. తప్పకుండా గుణం కనబడుతుంది!"

ఆప్యాయంగా రేణు మాట్లాడుతూంటే రోగం నయం అయినట్లనిపించిందామెకు.

"నీకున్న శ్రద్ధలో పదో వంతు మా రమకి వుంటే బాగుణ్ను!" అప్రయత్నంగా పైకే అనేసారు

రేణు మాట్లాడ లేదు.

"వారం రోజులైంది నిన్ను చూసి! అసలు రావడవే మానేసావ్!"

"ఈ వారమంతా డే డ్యూటీ చేస్తున్నానండి! చాలా మంది శలవుల్లో వెళ్లడంతో ఓవర్‌టైం చేయాల్సి వస్తోంది! తీరిక లేకుండా వుంది!" సంజాయిషీ యిచ్చుకొంది రేణు.

"మా అన్నయ్య యిప్పుడే వచ్చి వెళ్లాడు! వాడి తొందర వాడిది! నిష్ఠూరంగా మాట్లాడాడీపూట!"

ఆమె మాటలు అర్థం కాలేదు రేణుకి.

'మా ఒదిన ఉష పెళ్లి వచ్చే నెల్లో చేసేయాలని తొందర పడ్తోందిట! ఆ విషయం మాట్లాడ్డాని కొచ్చాడు. సమయానికి రఘు లేకపోవడంతో వెళ్లి పోయాడు!"

"అనుకొన్న సంబంధమే కదండి!" అంది రేణు ఏదో అనాలని.

"ఇప్పటివరకూ వాడి అభిప్రాయాన్ని తెల్సుకో లేదమ్మా! కాదనడనుకో! అయినా ముహూర్తం పెట్టే ముందైనా చెప్పాలి కదా!"

అంతలో వెంకాయమ్మగారు రావడంతో ఆగిపోయారు.

"వెంకాయమ్మగారూ! రేణు వచ్చింది! దాని కిష్టమైన వంట చేయండి పూట!"

## చైతన్యమూలం

నిన్ను చూస్తే నాలో
విద్యుత్తు ప్రవహిస్తుంది
నిన్ను తాకితే
నాలో వెలుగులు వరదలై పొంగుతాయి
ఆకాశంలో వున్న నీ అధరాల
అమృత గంగ కోసం
అనంత తపస్సు చేసే
నా చరమ జ్యోతికి
నిత్య చైతన్య మూలమై
నీవు నిలిచేదెప్పుడు?

- పోతుకూచి సాంబశివరావు

పురమాయించారు.

"లేదండి! నే వెళ్ళాలి!" అంది రేణు.

ఆమె అంగీకరించ లేదు.

"అసలీమధ్య రావడమే మానేసావ్! ఏం వండుకు తింటావులే! ఈ పూటకిక్కడ వుండి ఉదయమే వెళ్ళువుగాని! తొమ్మిదిన్నరయే సరికి రమ వచ్చేస్తుంది."

"నేనూ, రమా రోజూ మాట్లాడుకొంటూనే వున్నామండి".

'ఏవిటి?' అని ప్రశ్నార్థకంగా చూసారు అనసూయమ్మ. ఆ తర్వాత అర్థమైంది.

"ఓహో! ఫోనులోనా? బావున్నాయ్ మీ పలకరింపులు! అలో హలో అనుకొంటే సరా! అది వచ్చే వరకూ వుండాల్సిందే!" పట్టు పట్టారు.

కాలక్షేపం కోసం భగవద్గీత చదవడం ప్రారంభించింది రేణు.

తొమ్మిది గంట లయేసరికి రఘు రావడంతో చివాల్న లేచి నిలబడింది రేణు. రఘు తిన్నగా మెట్లెక్కి మేడమీదికి వెళ్తుంటే-

"సాయంత్రం మావయ్యొచ్చాడురా!" చెప్పారు అనసూయమ్మ

వెనక్కి తిరిగి, "ఏడీ! వున్నాడా?" అడిగాడు రఘు

సానుభూతి ప్రకటించారు.

అసలు విషయం ఎలా అడగడమా? అని ఆలోచిస్తూ వుండిపోయింది రేణు

"ఎప్పుడు వెళ్ళాలనుకుంటున్నావ్?" అడిగిందామె

"జీతం అందుకొని మొన్ననే పంపేసాను! ఓవర్ టైం బిల్లు మరో పది రోజులు పోతే గానీ అందదండి! నానుస్తూ ఆగిపోయింది

విషయం అర్థం చేసుకొన్నారు అనసూయమ్మ

అప్పుడే నిద్రలేచి వస్తున్న రమని పిలిచారు కళ్ళు నులుముకొంటూ తల్లిని సమీపించింది రమ

"అన్నయ్య లేచాడో లేదో చూడమ్మా!

మేడ మీదకి వెళ్ళి వెంటనే తిరిగొచ్చింది.

"ఆఁ లేచాడు షేవ్ చేసుకొంటున్నాడు!" చెప్పింది ఆ తర్వాత రేణు వైపు చూసింది

"ఏవిటి సంగతి? కళ్ళతోనే ప్రశ్నించింది రేణు మాట్లాడలేదు తల్లి మేడ మెట్లు ఎక్కుతూంటే అడిగింది రేణుని

ఏవిటి విశేషం?"

కనకం! బొమ్మన్

ఆలస్యం ఐపోయిం ది. పాపం ఆయన ఆకలికి ఆగలేరు వెళ్ళిన వెంటనే వండాలి!

నువ్వు రాడం ఆలస్యం అవుతుందని వచ్చాక వండడం నీకు శ్రమని అన్నం కూరా వండేశా కనకం!

నన్ను మెచ్చుకుం టుందిలే!

పిచ్చిమనిషి! ఎంతప్రేమ!

బాగానే వండారు! కాని పొగిడితే నెత్తికెక్కుతారు

ఏం వంటలండీ ఇవి! ఒక్కటీ తినలేక చస్తున్నా! ఎంతైనా మగవాళ్ళ వంటలు అనిపించాయి!

బొమ్మన్

"ఇంతవరకూ ఉంటాడు(రా)" నే చెప్పు దొస్తావో తెలదు! మళ్ళీ వస్తానని వెంటనే వెళ్ళిపోయాడు!"

తనయుని మూడ్స్ గమనించిన తల్లి ఆ సమయంలో అంతకన్నా ఎక్కువ మాట్లాడలేక పోయింది.

మరో అరగంటకు రమ రాగానే భగవద్గీతను కట్టిపెట్టింది రేణు

రాత్రి భోజనాల దగ్గర పెళ్ళి ప్రస్తావన తేవాలను కొన్నారు అనసూయమ్మ. కానీ వీలు పడలేదు

మర్నాడుదయం చీకటితోనే లేచింది రేణు. పెరట్లో పూలు కోసి అనసూయమ్మగారి పూజా మందిరంలో వుంచింది కాఫీ తాగుతూ అనసూయమ్మగారితో అంది.

"నాన్న గారికి సుస్తీగా వుందని తమ్ముడు లెటరు రాసాడు. నన్ను చూడాలంటున్నారుట!"

"అలాగా! ఓసారి వెళ్ళిరావమ్మా! పెద్దకాలం! పైగా నీకు పెళ్ళి కాలేదన్న దిగులు!"

విశాఖపట్నం వెళ్ళాలి! నాన్న గారికి ఒంట్లో బాగులేదని ఉత్తరం వచ్చింది! డబ్బు కావాలి" చెప్పింది రేణు

"నన్నడగలేక పోయావ్ యిచ్చేదాన్ని! వందరూపాయలున్నాయ్".

చాలవన్నట్లు పెదవి విరిచి తలూపింది రేణు చేతిలో చెక్కుతో మేడదిగారు అనసూయమ్మ

"వాడిదగ్గరా లేవుట! నాలుగు వందలకి చెక్కు రాయించాను! బాంక్‌లో మార్చుకో!" చెక్కు అందించారు

కృతజ్ఞతతో చేతులు జోడించి ఆ చెక్కునందుకొంది రేణు గేటు దాకా రేణుని సాగనంపారు ఆతల్లీ కూతుళ్ళిద్దరూ.

'డబ్బు యింకా అవసరమైతే ఫోన్ చెయ్యి! పంపుతాం! మొహమాట పడకు' కేక వేసారు అనసూయమ్మ

(ఇంకా ఉంది)

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1. చందా పైకము రు. 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును.
2. ఎమ్.ఒ.లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్.ఒ. పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి. లేదా డి.డి.ని కూపన్‌తో జతచేయాలి.
3. చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును.
4. చందా పైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును.
5. ఎమ్.ఒ.లు, డి.డి.లు వ్యక్తుల పేర పంపించకూడదు.
6. కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు. లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
7. కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, పూర్తిగా వ్రాయాలి. వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును.

--- కత్తిరించాలి ---



నిజమయితే ✓
కాకపోతే x
అని గుర్తుపెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. (   )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. (   )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక (   )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ (   )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..............................

..............................

చిరునామా : ..............................

..............................

..............................

ఎమ్ ఓ. పంపిన తేదీ: ..............................

లేదా

**డి. డి. జత చేయడమైనది.**

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
   కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :
   కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.
9. ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.
   గమనిక : ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.
10. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు.

# మగాళ్ళు

కెప్టెన్ షేక్ మౌలాలీ

ఆంధ్రప్రదేశ్‌లోని ఒక నగరం శివార్లలో ఉన్న ఒక కాలనీ అది. డాక్టర్లు, ఇంజినీర్లు, లాయర్లు, లెక్చరర్లు, ఆఫీసర్లు, పెద్ద వ్యాపారులు కలిసి ఒక సంస్థగా ఏర్పడి అత్యంత ఆధునిక సౌకర్యాలతో చక్కని భవనాలు నిర్మించుకున్నారక్కడ. సతత హరిత వృక్ష రాజముల నుండి పరిమళపూరిత వివిధ పుష్పజాతుల, ఫల వృక్షాలు కాలనీ అంతటా వ్యాపించాయి. పగలంతా నగరంలో రణగొణ ధ్వనుల మధ్య తమ తమ కార్యక్రమాలను పూర్తి చేసుకొని సాయం సమయానికల్లా ఎవరి క్వార్టరుకు వారు చేరుతుంటారు.

ఆ కాలనీ ఏర్పడే సమయంలో ఒకే తరగతి వారయితే చాల హుందాగా ఉంటుందని భావించి, తక్కువ స్థాయి వారికి అందులో చోటివ్వలేదు. అయితే నాలుగు సంవత్సరాలు గడిచేసరికి అక్కడి జన సమూహంలో ఆప్యాయత, ఆత్మీయత పెంపొందడానికి బదులు పరస్పర ద్వేషభావం లేకపోయినా, అసూయ ఛాయలు పెరిగి ప్రశాంతతకు బదులు నిస్తబ్ధత బాగ చోటు చేసుకుంది.

"ప్రాక్టీసు లేని లాయరు, శాంపిల్ మందులు అమ్ముకుంటూ చిన్న - చిన్న జబ్బులను కూడ కాంప్లికేటిడ్‌విగ సృష్టించి రోగులను భయాందోళనలకు గురిచేసి విపరీతంగ డబ్బు గుంజే డాక్టరు, కాంట్రాక్టర్లతో కుమ్మక్కయి ప్రభుత్వానికి ద్రోహం చేయడానికి వెనుకాడని ఇంజినీరు, కాలేజీలో పాఠాలు చెప్పకుండా ఇంటి దగ్గర మిని ట్యుటోరియల్ కాలేజి నడిపే లెక్చరరు, కవరుపై కవరు పుచ్చుకుని లక్షలు వెనకేసుకున్న ఆఫీసరు, సమాజాన్ని నిలువునా దగా చేసే వ్యాపారి,"- అని ఆ కాలనీలో ఒకరిని గూర్చి మరొకరి అభిప్రాయం. కథ అంతటితో ఆగక ఒక్కోసారి తమలో తాము దుష్ప్రచారాలు చేసుకోవడం కూడ మొదలెట్టుకున్నారు. ఫలితంగ ఆ కాలనీలో ఏ ఇద్దరు వ్యక్తులు కలుసుకున్నా, మూడో వ్యక్తిని గురించి చెప్పుకోవడం పరిపాటి అయింది.

అయితే రోడ్డుమీద కలుసుకున్నప్పుడు మాత్రం "హలో హౌ ఆర్ యూ!","హౌ డుయు డూ!', "ఫైన్ థాంక్యూ!" లాంటి పైపై మర్యాదలు అడపా -దడపా సమయం గడవటానికి కాక్ టైల్ లాంటి ఆంతరిక మర్యాదలు జరుగుతుంటాయి. కాని వీటిలో ఎక్కడా స్పందన, స్నేహం, మాధుర్యం మచ్చుకైనా కన్పించవు. ఇక మహిళలు మాత్రం పేరంటాలు, నోముల పేరిట తరచు కలుసుకోవడం చేస్తుంటారు. వారిలో మాత్రం పరస్పర అవగాహన కొంతవరకు కానవస్తుంది

బయట నుండి ఎవరయినా వ్యక్తి వచ్చి చూస్తే, ఆ సుందర హర్మ్యాలు ప్రశాంత విశ్రాంత మందిరాలనిపిస్తాయి, ఆ కాలనీ ఒక పావన బృందావనంలాగే కనిపిస్తుంది. కాని బృందావనంలోని తాపసికతకు బదులు అక్కడ నీరవత తాండవిస్తుంది అరిషడ్వర్గాలు విజృంభించి, మనస్సులు వికలమై దాదాపు అందరికి అక్కడ బి. పి. హెచ్చు దశలో ఉంటుంది. కాలం గడిచేకొలది 'ఎవరికి వారే' అన్నట్లు 'వన్‌సెస్' పెరిగి, సాటివారి మిద విశ్వాసం తగ్గి, ఇంటికి నాలుగు కుక్కల్ని పెంచుకుంటూ, వాటితోనే ఎక్కువ కాలక్షేపం చేయసాగారు బొమ్మలు సరిగ కన్పించని టి. వి. సెలవు రోజుల్లో అడపా - దడపా కొంత సమయాన్ని తీసుకుంటుంది.

రెండు వందలకు పైచిలుకు భవనాలు లేచిన ఆ కాలనీలో దాదాపు అంతా స్వంతదారులే ఉంటున్నారు. ఎక్కడైనా అద్దె ఇళ్ళు ఉంటే పదికి మించవు. ఓ అద్దె ఇంట్లో కొత్తగా చేరిన లేడి డాక్టర్ అందరి చర్చకు కేంద్రమయింది.

ఒక బిల్డింగు కాంపౌండు గేటుకు తగిలించబడ్డ 'డాక్టర్ శారద' అనే నేమ్ బోర్డు అందరి దృష్టి నాకర్షించింది.

ప్రతి రోజు ఉదయంతొమ్మిదయ్యేసరికల్లా చేతిలో స్టెతస్కోపుతో ఆమెబయటికొస్తుంది. హిరణ్య వర్ణపు శరీర కాంతికి, తెల్లని చీర మరికొంత వన్నె చేకూరిస్తే నుదుటి సింధూరం నిండుతనం తెస్తుంది. గేటుకు తాళం బిగించి, కొంత దూరం నడిచి బస్సు కోసం వెయిట్ చేస్తుంది వచ్చే - పోయే ఆ కాలనీ కళ్ళు మరికొంత విచ్చుకొని ఆమె వైపు ప్రశ్నార్థక భావాలతో, ఆకలి దృక్కులతో చూస్తూ ఉంటాయి.

కాని -

"యాకుందేందు తుషారహార ధవళా
య శుభ్రవస్త్రాన్వితా!"

అన్నట్లు, ఆమె నిశ్చలంగ సిటి బస్సులో వెళ్ళి ప్రభుత్వ ఆసుపత్రిలో పనిచేసి సాయంత్రం వేళకు తిరిగి నివాసం చేరుతుంది.

ఆ కాలనీలోని బడా - బడావారంతా చీకటి సమావేశాల్లో, చల్లని వాతావరణంలో వెచ్చబడుతూ, మోతాదుకు మించి తీర్థం సేవించి, కైపు ఎక్కువయి, అంతా కలిసి కట్టుగ తమ మనః పంకిలాలను ఆ డాక్టరమ్మకేసి విసురుతారు.

"వయసు పాతిక - ముప్పయి కంటె మించదు!"

"పాపం ఒంటరి జీవితం!'

'ఒక్కతే అంత పెద్ద ఇంట్లో ఉండటానికి భయం లేదేమో!"

"మొత్తానికి అందాలరాశి!"

"కాని ఏం లాభం! అడవి గాచిన వెన్నెల!!"

"ఇంతకు ఒంటరి జీవితమేనా?"

'మేనా కాదు! ఒక్కతే ఉంటుంది."

'వంటమనిషి?"

"ఎవరూ లేరుమల్లే ఉంది. పొద్దున్నే పని మనిషి వచ్చి పాచి పని చేసి వెళ్తుంది."

"మిగతావివరాలు ఏమిటో!"

"మి ఆవిడను పంపించి కనుక్కోండి .. తర్వాత మా క్కూడా వివరంగ చెప్పండి!"

"అమ్మ బాబోయ్! మా ఆవిడ నన్ను చంపేస్తుంది అసలే అనుమానం మనిషి."

"పెళ్ళయ్యిందో లేదో!"

"ఏం, మిరేమయినా ప్రయత్నం చేస్తారా?"

"మీరు నా గురించి రికమండ్ చేస్తారా!"

"వెయిట్ అండ్ ట్రై! లెట్ అజ్ బి నాట్ హేస్టీ!'

"విడాకుల కేసని నా అనుమానం."

"అది తెలుస్తుందిగా!"

"టైమ్ ఒకటిన్నర దాటింది. ఇక లేద్దామా .. రేపు ఎస్ టిన్‌లో తిరిగి కలుద్దాము."

"బాయ్!"

'గుడ్ నయిట్!"

"నో ... నో ... గుడ్ మార్నింగ్ . ఇట్ ఈజ్ ఎబౌట్ టు ఒ క్లాక్ నౌ!"

నవ్వులు!

ఈ విధంగ సాగుతుంటుంది ఆ కాలనీ నాగరిక సభ్యుల అంధకార సమావేశం.

ఒక రోజు లాయరు కాశీనాధం తన తమ్ముడు లోకనాధాన్ని అందరికి పరిచయం చేశాడు - "మా వాడు బరంపురంలోని ఒక ప్రైవేటు కంపెనీలో ఫైనాన్స్ మేనేజరుగ ఉంటున్నాడు. మంచి స్పోర్ట్సమన్. కరాటే - జూడోలలో బాగ చేయి తిరిగినవాడు. బ్లాక్ బెల్ట్‌కూడ ఉంది. కావాలంటే మనమంతా కరాటే నేర్చుకోవచ్చు! ఫీజు సంగతి తర్వాత ఆలోచిద్దాం. ప్రస్తుతం నెల రోజులు సెలవు మిద వచ్చాడు."

అంతా సరేనంటే సరేనసుకున్నారు. అందరూ యనిఫారం కుట్టించి ప్రతి రోజు ఉదయాన్నే రోడ్లన్ని కలియ పరుగెత్తడం, ఎక్సర్‌సైజు వగయిరాలు చేయసాగారు. నెల రోజుల్లో తామంతా గొప్ప యోధులయిపోయినట్లుగ భావించుకున్నారు.

ఎండాకాలం వచ్చింది. బావుల్లో నీరు ఇంకిపోవడం, పంపుల్లో నీళ్ళు రాకపోవడం, కరెంటు కోతలాంటి వేసవి లక్షణాలతో పాటు దొంగతనాలు

కూత ఉధృతంగ ఉన్నాయి.

రాత్రిళ్ళు లోపల పడుకుందామనుకుంటె కరెంటు లేకపోవడంతో ఫ్యానులు, ఎ సి లు పనిచేయక ఊపిరాడడంలేదు పోని ఆరుబయట పడుకుందామంటే దొంగల బెడద కాపలాకు కొన్ని కుక్కలు అలంకారప్రాయంగ మిగిలి టామి, జూలీ, జాని, రిటా . అంటూ ఎలుచుకొటానిక మాత్రమే ఉపయోగపడుతున్నాయి

రోజులు గడిచే కొలది దొంగల రద్దీ ఎక్కువయింది ఇళ్ళను వరుసపెట్టి దోచుకోసాగారు కొన్ని ఇళ్ళకు కన్నాలు వేస్తే, కొన్నింటికి కిటికీ ఊచలు వంచారు. మరికొన్ని ఇళ్ళ వాకిళ్ళు పగులగొట్టారు

పోలీసులకు రిపోర్ట్లు వెళ్లాయి వాళ్ళు కూత వచ్చి గస్తి తిరిగి పోతున్నారు కాని విచిత్ర మేమిటంటే పోలీసులు తిరగడానికి సరిగ్గా అరగంట తేడాతో దొంగతనాలు జరుగుతున్నాయి దింతో కాలనిలో మరికొంత కలవరం పెరిగి కొందరు, పోలీసుల మిద అనుమానం వ్యక్తం చేశారు

అందువలన పోలీసులు రెచ్చిపోయి "పెరిగే జనాభాను, ఏరియాను దృష్టిలో పెట్టుకుని మా పోలీసు బలాన్ని కూడ పెంచాలండి! ఇప్పటికే మా శక్తికి మించిన డ్యూటీ చేస్తున్నాము. మిరెట్లాగు మమ్మల్ని అనుమానించారు కనుక రేపటి నుండి మా పోలీసువారు మి కాలనీకి అసలు రారు మి తంటాలు మిరు పడండి!" అని కచ్చితంగ చెప్పేశారు

మరునాటి నుండి దొంగల భయం మరి పెరిగిపోయింది. సాయంకాలం ఏడు దాటితే అంతా బయటకు రావడం మానేశారు. పూర్తిగ తెల్లవారితేనే తలుపులు తెరచుకుంటున్నాయి ఎప్పుడు, ఎవరి ఇంట్లో దొంగలు పడతారో చెప్పలేని స్థితి. పైగా ఇంటిలోని వారందరిని చావమోది మరి దోచుకుంటున్నారు ఈ అదను కనిపెట్టి, పగలు బజార్ల వెంట పెద్ద మనుషులుగా చెలామణి అవుతూ తిరిగే బాపతు కూడ సొమ్ము చేసుకోసాగారు

ఈ భయోత్పాత వాతావరణం మూలాన చీకటి సమావేశాలు మరుగున పడినయ్. "మంచి రోజులు రాకపోతాయా! ఇప్పటి మోతాదు కూడ అప్పుడు లాగించక పోతామా" అని సర్దుకున్నారు సదరు కాలనీలోని నాగరిక పురుష పుంగవులు.

ఒక అర్ధరాత్రి వేళ "అమ్మో .. నాయనో . దొంగలు! ... దొంగలు!!" అన్న కేకలు ఓ ఇంట్లోంచి వినిపించి, కాలనీ అంతా మేల్కొంది. కాని, కాలు బయట పెట్టినవారు లేరు. కనీసం లైట్లయినా వేయకుండ, "లైట్లు వేస్తే దొంగలు ఎక్కడ కక్ష పెంచుకొని తడాకా చూపిస్తారో!" అనుకుంటూ, చీకట్లోనే దాక్కొని కిటికీల గుండ బయటకు చూస్తున్నారు

అది ఇటీవలనే రిటైరైన ఓ ఆఫీసరు ఇల్లు. కూతురు పెళ్లి చేయాలి అబ్బాయిని చదివించాలని, ఇల్లు కట్టించుకోవాలని, ఇక ముందు ఈ పై సంపాదన' ఉండదు కదా' అని రిటైరు కాబోయే ముందు మూడు తరాలకు సరిపడ మూటగట్టి ముక్కంటికి కూడ తెలియకుండ భద్రంగ దాచాడు

కాని ఏం లాభం తలుపులు పగులగొట్టి లోన ప్రవేశించిన దొంగలు ఇంటి వారందరిని చావమోది ఉన్నదంతా మూటగట్టుకున్నారు

'నోరు విప్పితే ప్రాణాలకే ముప్పు' అని భావించిన ఆ కుటుంబ సభ్యులు కిక్కురుమనకుండ బొమ్మలలాగ చూస్తుండిపోయారు

అంతా ఒలుచుకున్న ఆ దొంగల దృష్టి ఆ ఇంటి ఇల్లాలు అనసూయమ్మపై పడింది వారిలో ఒకడు ఆమె 'తాళి'ని పట్టుకున్నాడు

పాపం ఆ ఇల్లాలు అతనికి చేతులు జోడించి వదలమని ప్రాధేయపడింది అతను రెచ్చిపోయి, మరి కొంత గట్టిగ గుంజుతున్నాడు కాని ఆమె 'తాళి'ని రెండు చేతులతో పట్టుకొని 'బాబు' నీకు పుణ్యముంటుంది మంగళసూత్రం వదులు మరేం వస్తువు కావాలన్నా తీసుకుపో' అంటూ శతవిధాల బ్రతిమలాడుతుంది.

"ఏమిటిరా, ఆడ పీనుగతో అంతసేపు లావాదేవి? ఒక్క తన్ను తన్ని తొందరగ తెములు!" అన్నాడొకడు వారిలో మందలించే ధోరణిలో!

ఇంతలో మంగళసూత్రం పట్టుకున్న వాడి నెత్తిన పిడుగుపాటులాగ వెనుక వైపు నుండి కర్రతో గట్టి దెబ్బ పడింది

"అబ్బా' అంటూ దిమ్మతిరిగి కూర్చున్నాడతను.

వెంటనే 'ఏమయిందిరా!" అంటూనే తన చేతిలోని కర్రతో ఆ వచ్చిన వ్యక్తిని ఎదుర్కొన్నాడు మరో దొంగ

ఆ కారు చీకట్లో అర నిముషంపాటు కర్రలు కొట్టుకుంటున్న శబ్దం వినిపించింది చివరకు అమ్మో' అన్న ఆడ గొంతు వినిపించింది.

తొందరచెం గెంతండిరా' ' అనుకుంటూ దొంగలు



# ఈ·వేమన·పద్యాలు




జలములు పుణ్యస్థలములు
గలవీ లోకములందు కడు దూరముగా
వెలసిన తీర్థ స్నానము
అలమటగద మోక్షమేది యలసట వేమా

సొమ్ముతో సహా ఉడాయించారు.

మరో ఐదు నిముషాలు గడిచాక, దొంగలు వెళ్లిపోయారని నమ్మకం కుదిరాక గాని అందరి ఇళ్లలో లైట్లు వెలగలేదు.

మంగళసూత్రం - దక్కించుకోగలిగిన అనసూయమ్మ తేరుకొని "అమ్మో ఇక్కడెవరో అమ్మాయి పడిపోయింది!" అని కేక పెట్టడంతో బిక్కు బిక్కుమంటూ జనం మెల్లగ చుట్టూ చేరారు.

ఆమెను పరికించి చూచిన ఆ ఇల్లాలు

## మగాళ్ళు

"అయ్యో!పక్కింటి మన డాక్టరమ్మేనండి! పాపం నా మంగళసూత్రం కాపాడడానికని వచ్చి దెబ్బలు తగిలి పడిపోయింది!" అంటూ బావురుమంది

చుట్టూ చేరిన జనంలో కలకలం బయలుదేరింది

"బలమైన గాయం తగిలిందేమో!"

"త్వరగ ఆసుపత్రికి తీసుకెళ్తే మంచిది"

"స్పృహ తప్పినట్లుంది."

"ఎంత ధైర్యం చేసింది."

"ఆలస్యం చేయకుండ డాక్టరును పిలవడం మంచిది!"

తలో విధంగ అనుకుంటున్నారు. కాని ఎవ్వరూ కూడ ముందుకు వచ్చి ఆమెకు ఉపచారం చెయలేదు. "అబ్బా!" అంటూ మెల్లగ లేచి కూర్చుంది డాక్టర్ శారద.

"ఏమ్మా, ఎలా వుంది! సమయానికి వచ్చి ప్రాణానికి తెగించి ఆదుకున్నావు. నీ రుణం ఎలా తీర్చుకోను!" కన్నీళ్లు తుడుచుకుంటూ అంది అనసూయమ్మ.

"పర్వాలేదు! కొంచెం కళ్లు తిరిగాయంతే! ప్రస్తుతానికి ఏదయినా ఫస్ట్ ఎయిడ్ చేస్తాను. తెల్లారాక ఆసుపత్రిలో చూపించుకుంటాను ... విచిత్రమేమిటంటే మా వారు జర్మనీ నుండి రిసర్చ్ పూర్తి చేసుకొని రేపె వస్తున్నారు. తలకు బ్యాండేజ్‌తోనే రిసీవ్ చేసుకోవాలేమో!" అంటూ నీరసంగ నవ్వింది.

అరె! డాక్టర్ శారద! ఆమె ఈ హడావిడిలో ఇక్కడికెందుకు వచ్చింది?" అన్నాడు భార్య తెచ్చిన కట్నంతో ఇల్లు కట్టించుకున్న ఏమాత్రం ప్రాక్టీసు లేని లాయరు అప్పుడే వచ్చి.

అనసూయమ్మకు హృదయం ఆక్రోశించి ఒళ్లు మండింది.

"ఎంత బాగా క్రాస్ ఎగ్జామిన్ చేశారండి! మీలాంటి మగాళ్లంతా చేతగాని వాళ్లయితేనూ, గాజులు తొడుక్కున్న అబల సాటి ఆడదాన్ని కాపాడడానికి ముందుకు వచ్చింది. పెద్ద - పెద్ద చదువులు, ఉద్యోగాలు, హోదాలు మీ మగాళ్లను పిరికివాళ్లను చేశాయి. మీకంటే ఒక మామూలు కూలివాడు మేలు! తన భార్యాబిడ్డలకు తన ప్రాణాలొడ్డి అయినా రక్షణ కలిగిస్తాడు.

అంత ఎందుకు? ఈ కాలనీలో అసలు పౌరుషం గల మగాళ్లున్నారా, అని అడుగుతున్నాను. దొంగలకు భయపడి, ఇళ్లలోనే నక్కి కూర్చునే మగసిరి కలవాళ్లు మీరంతా.

దొంగల్ని మీరు ఎదుర్కొనక్కరలేదు. కాలనీలో గల వాళ్లంతా కలిసి, కనీసం తలా రెండు రాళ్లు వారిపై విసిరితే చాలు! దొంగలు కుప్పకూలి పారిపోతారు. వంతుల వారిగ మీరు కాలనీలో గస్తి తిరుగుతుంటే దొంగలు ఇటు కన్నెత్తి కూడ చూడలేరు.

పక్కవారు ఏమయినా పరవాలేదనుకొనే స్వార్థపరులు మీరు. కనీసం భార్య మంగళసూత్రాన్ని కాపాడుకోలేని పిరికివాళ్లు మీరు! అంతేకాదు, వాళ్లు మరేం చేసినా నిస్సహాయులుగ చూస్తుండేవారే మీరంతా!

కండబలం ఉన్నా, లేకపోయినా, గుండెబలం నిబ్బరంతో ఈ అమ్మాయి నన్ను కాపాడింది ఈ వేళలేకుంటే భర్త బ్రతికి ఉండగానే మాంగల్యం పోగొట్టుకుని ఉండేదాన్ని ... ఛీ మీరొక మగాళ్లేనా!" అంది ఆవేశంగ.

ఒక్క మగాడు కూడ సిగ్గుతో వంచిన తల ఎత్తలేదు. □



ఆబాలగోపాలాన్ని అయస్కాంతంలా ఆకర్షిస్తున్న 'టెడ్డీ'. అమెరికా కలెక్టర్ ఒకరు దీనిని 3,740 పౌన్లకి కొన్నారు!

మానసిక వికాసానికి హృదయోల్లాసానికి ప్రతీకలుగా మానవ జీవితంలో బొమ్మలు చోటు చేసుకున్నాయి. పసిమనసులను ఆకట్టుకోవడంలో ఈ బొమ్మలను మించినవి మరేవీ ఉండబోవు. నిశితంగా పరిశీలించే వారికి బొమ్మల తయారీలో క్రమానుగతమైన విలక్షణ పరిణామం కనిపిస్తుంది. ఎలక్ట్రానిక్స్ బొమ్మల తయారీలో అడుగు పెట్టడంతో ఆ పరిశ్రమ సరికొత్త అందాలను నింపుకొంటోంది. కొండపల్లి బొమ్మల సొబగులు కళాత్మక సంస్పందనను కలిగిస్తే ఎలక్ట్రానిక్ బొమ్మల విన్యాసాలు రసానంద జగత్తులోకి నడిపిస్తాయి. వేటి ఘనత వాటవే! వేటి విలువ వాటివే!

బొమ్మల ప్రపంచంలో విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకోవడమే కాక సంచలనాన్ని కూడా సృష్టిస్తున్న బొమ్మలు బుల్లి భల్లూకాలు! పశ్చిమ దేశాలలో ఆబాలగోపాలాన్నీ మురిపించి ఊహాతీతమైన ప్రాచుర్యాన్ని పొందిన ఈ ఎలుగు బొమ్మలు ఆర్థిక రంగంలో కూడా మరే రకమైన ఇతర బొమ్మలూ చేరలేని స్థాయిని చేరుకొన్నాయి. ఆశ్చర్యంతో ప్రపంచంలోని ప్రతి వారిని ముక్కు మీద వేలు వేసుకొనేలా చేశాయి!



గాలిగుమ్మటంలో 'టెడ్డీ'

# ఎలుగు బొమ్మల కళాత్మక వెలుగులు, వ్యాపార విలువలు!

1910 లో లండన్‌లో ఒక గూని ఎలుగుబంటి బొమ్మ 700 పవున్లకు అమ్ముడు పోయిందని వింటుంటే ఎవరికి మాత్రం విచిత్రంగా ఉండదు? ఎలిజబెత్ గ్లైనె అనే పాతికేళ్ల మహిళ 550 పవున్లకు ఒక పాత ఎలుగుగొడ్డు బొమ్మని కొనడం ఎవరికైనాసరే దిగ్భ్రాంతిలో ముంచుతుంది. ఆమె దగ్గర ఇలాంటి పాత బొమ్మలు – అన్నీ బుల్లి బుల్లి భల్లూకాలే – డబ్బయికి పైగా ఉన్నాయట! వీటిని సేకరించడం ఆమెకి గొప్పగా, సంతోషంగా ఉందిట! అలాగే సంగీతాన్ని వినిపించే భల్లూక రాజానికి 500 పవుండ్ల ధనం ముట్టజెప్పబడింది. అన్నింటి కంటె విచిత్రమైన విషయం స్టెయిఫ్ అనే ఎలుగు బొమ్మకి అక్షరాలా మూడు వేలా ఏడు వందలా నలభై పవుండ్లు చెల్లించడం! ఈ బొమ్మ 1905 లో జర్మనీలో తయారు చెయ్యబడింది.

ఈ ఎలుగుబొమ్మలకు ఇంత గిరాకీ ఎందుకొచ్చిందో అర్థం కాదు. వీటి లోపల వజ్ర వైఢూర్యాలేవీ ఉండవు. దూదికాని పట్టుకాని లేదా అరుదుగా ఉన్ని కాని ఉంటుంది. అవి కూడా బాగా వాడినవే అయి ఉంటాయి. మరెందుకని ఈ బొమ్మల పట్ల జనం ఆసక్తి చూపుతున్నారో తెలిసిరాదు. పైగా ఉత్తమ బుల్లి భల్లూకానికి అవార్డు అంటూ ఇంత వరకూ మనం విని ఉండని ఒక పోటీని కూడా ఏర్పాటు చేయడం అనూహ్యం! విల్ట్ షయర్‌లో ఇటీవల బుల్లిభల్లూకాల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో 25,000 బుల్లి భల్లూకాలు – యజమానులతో సహా – పాల్గొన్నాయి. ఉత్తమ ఎలుగు బొమ్మకి అవార్డును నిర్ణయించడం ఈ సదస్సులోని విశేషాంశం! ఈ అవార్డును లార్డ్ బాత్ అనే బ్రిటిష్ దేశస్థుని వద్ద ఉండే క్లారెన్స్ అనే బుల్లి భల్లూకం ఆధారంగా నిర్ణయించడం జరిగింది. ఈ క్లారెన్స్ ఎలుగు బొమ్మల్లో పరిణతి పొందినదని

బుజ్జి ఎలుగుబంట్లంటే పాపాయి. కళ్లలో ఎంత మెరుపులు!



ఎంతో పెద్ద ఎలుగుబంటి బొమ్మ. ఒక బాలుడు కూర్చునే చోటు ఇవ్వగలిగినంత పెద్దది.





పిల్లలతో దూ నీడగా

లార్డ్ బాత్ చెబుతున్నారు.

ఎలుగు బొమ్మల సదస్సులో ప్రధానంగా చర్చించబడిన అంశం ఆ బొమ్మల పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించినది. ఈ బొమ్మలు ఇరవైవ శతాబ్దం ప్రారంభంలో తయారు చెయ్యబడ్డాయని నిర్ధారించడం జరిగింది. అయితే మొదటిసారిగా ఈ బొమ్మను తయారు చేసిన వారు ఎవరు అన్నది సందేహంగానే ఉంది. పశ్చిమ జర్మనీకి చెందిన మార్గరెట్ స్టెయిఫ్ అనే మహిళ ఈ బొమ్మను 1902 లో రూపొందించినట్లు కొందరు చెబుతున్నారు. పోలియో వ్యాధి వల్ల కాళ్ళు రెండూ చచ్చుబడిపోయి ఇంటి వద్దనే ఉండిపోయిన స్టెయిఫ్ జీవనోపాధిగా బొమ్మలను చేయడం మొదలు పెట్టి, ఎలుగు బొమ్మలను రూపొందించి అనతికాలంలోనే పేరు ప్రఖ్యాతులతో పాటు అస్తిపాస్తులను కూడా చేజిక్కించుకోగలిగింది.

అమెరికా ప్రెసిడెంట్ థియోడోర్ రూజ్‌వెల్ట్ ఈ ఎలుగు బొమ్మల పట్ల బాగా మక్కువ చూపించడంతో, ఆ బొమ్మ ఉండడం ఒక ప్రత్యేక ఆకర్షణగా అందరూ భావించారు. అప్పుడే ఈ బొమ్మకు "టెడ్డీ" అనే ముద్దు పేరు కూడా వచ్చింది. అయితే "టెడ్డీ"ని మొదటిసారిగా తయారు చేసింది మోరిస్ మిక్‌టోమ్ అనే రష్యా దేశస్థుడని మరికొంత మంది అభిప్రాయం. మిక్‌టోమ్ న్యూయార్క్‌లో స్థిరపడిన వాడు. అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ ఎలుగుబంటిని చంపడానికి నిరాకరించినప్పుడు పత్రికలలో కార్టూన్లు పడ్డాయి. ఒక కార్టూన్‌ని చూచి ఉత్తేజం పొంది "టెడ్డీ"లను తయారు చేయడం మిక్‌టోమ్ ప్రారంభించాడని చెప్పబడుతోంది. మొత్తానికి "టెడ్డీ"ల సృష్టికర్తలుగా మార్గరెట్ స్టెయిఫ్, మోరిస్ మిక్‌టోమ్‌లు ఇద్దరూ పరిగణింపబడుతున్నారు.



అమ్మకానికి సిద్ధంగా ఉన్న టెడ్డీలు

మొదట మొదట్లో తయారైన ఎలుగు బొమ్మలకి పొడవైన ముట్టెలు, సన్నటి నోసళ్ళూ ఉండేవి. కాని ఇప్పుడు తయారవుతున్న వాటికి చప్పిడి ముక్కులు, నిండుకున్న బుగ్గలూ, విశాలమైన నోసళ్ళూ ఉంటున్నాయి. ఈ ఎలుగు బొమ్మల పట్ల విశేషమైన ఆసక్తి కలగడానికి కారణాలను అన్వేషిస్తున్న మనస్తత్వ శాస్త్రవేత్తలు "ఈ బొమ్మలు స్నేహితుల్లాగా అనుభూతిని కలిగిస్తాయని, తోడుగా ఉండి సుఖమైన నిద్రకు దారి తీయిస్తాయని" అంటున్నారు.

"టెడ్డీ"ల పట్ల ఆకర్షించబడనివారు లేరనే చెప్పాలి. బ్రిటిష్ రాణి వద్ద, రాకుమార్తె అన్నే వద్ద, రాకుమారుడు ఎడ్వర్డ్ వద్దా "టెడ్డీ"లు ఉన్నాయి! బ్రిటిష్ ప్రధానమంత్రి మార్గరెట్ థాచర్ దగ్గర, కార్మిక నాయకుడు నీల్ కిన్నాక్ దగ్గరా ఈ ఎలుగు బొమ్మలు ఉన్నట్లు తెలుస్తోంది. డొనాల్డ్ కాంప్‌బెల్ అనే ప్రసిద్ధ క్రీడాకారుని వద్ద "వాప్పెట్" అనే "టెడ్డీ" ఉండేది. కాంప్‌బెల్ పడవ ప్రమాదంలో మరణించినప్పుడు ఆయన శవం దొరకలేదు కాని, ఆయన ప్రక్కనే ఎప్పుడూ ఉండే "వాప్పెట్" మాత్రం దొరికింది! ఇది 1967లో జరిగిన సంఘటన.



చిన్నారులకి అభయప్రదాతగా

రాకుమార్తె అలెగ్జాండ్రా దూరప్రాచ్య దేశాలకు విహారయాత్ర సలిపినప్పుడు బర్మాలోని ఒక చిన్న పట్టణంలో ఎంతో ఇష్టమైన "టెడ్డీ"ని ఆమె మరచిపోయింది. వెంటనే ఆ బొమ్మకోసం అధికార స్థాయిలో దర్యాప్తు జరిపి ఒక లాండ్రీ షాపులో దొరికిన ఆ బొమ్మను అలెగ్జాండ్రాకు భద్రంగా అందజేయడం జరిగింది. దశాబ్దం క్రితం జరిగిన ఈ సంఘటన ఎంతోమందిని ఇప్పటికీ ఆశ్చర్యచకితులను చేస్తూ ఉంటుంది. ఒకసారి బ్రెజిల్‌లోని రియోడి జానియిరో ఎయిర్‌పోర్ట్‌లో ఒక వ్యక్తి వద్ద ఒక పెద్ద "టెడ్డీ" బొమ్మ ఉంటే, కస్టమ్స్ అధికారులు అనుమానపడి దానిని శోధిస్తే 500 జతల స్మగుల్డ్ నైలాన్ దుస్తులు బయటపడ్డాయట! అందమైన "టెడ్డీ"లను ఇలా వాడుకోవడం విచారాన్ని కలిగిస్తుంది.

ఎలుగు బొమ్మల పట్ల రోజు రోజుకు పెరుగుతున్న మోజు పశ్చిమ దేశాలవారిని ఉద్రూతలూగిస్తోందని చెప్పడానికి దృష్టాంతంగా నిలుస్తుంది "అలాయ్‌సియస్" అని పిలువబడే "టెడ్డీ"! 1910లో తయారైన ఈ బొమ్మను 1000 పవుండ్లకు భీమా చేయడం ప్రపంచ చరిత్రలోనే మొదటిసారి! ఎలుగు బొమ్మలు వెదజల్లుతున్న కళాత్మక వెలుగులను చూచి ఆనందించవచ్చునేమో కాని, వాటి కోసం మనుషులు తీస్తున్న వేలం వెర్రి పరుగులను మాత్రం హర్షించలేము.

-మార్కస్ బ్లేక్

(ఆసియా ఫీచర్స్)

సీరియల్

# సంకెళ్ళెవరికి?

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

ఇండియా టూరిజమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వాళ్ళ బస్సులో నలభై మంది కాడెట్లు, కాప్టెన్ సువర్చల, లెఫ్టినెంట్ సుశీల బయల్దేరారు. ఇరవై రోజులు కఠిన నియమాలతో కూడిన కాంప్ లైఫ్ గడపి వుండడంతో ఆటవిడుపుగా వుంది వారికి.

"రూపా! కాంప్ లైఫ్ నిన్నటితో నే అయిపోయింది! రిలాక్స్" అని సువర్చల అనగానే-

"హిప్! హిప్! హుర్రే" అంటూ కేకలు-

"బ్రేవో" అంటూ అరుపులు-

"సువర్చలా మేడమ్ జిందాబాద్" అంటూ కరతాళ ధ్వనులూ మిన్నుముట్టాయి.

రూప క్లాస్‌మేట్ సుందరి సాగర సంగమంలోని పాట పాడడం మొదలెట్టింది. మిగిలిన వాళ్ళు అనుగుణంగా తాళం వేయసాగారు.

క్రీక్‌మని శబ్దం చేస్తూ బస్సు ఆగిపోయింది. నడిరోడ్డు మీద పండు ముసలి ఒకామె పడిపోయి గిలాగిలా కొట్టుకోసాగింది. ఆమె కళ్ళజోడు ఒక వైపుగా, చేతిలో వున్న సంచి ఒక వైపుగా పడి వున్నాయి. బస్సు ఆగగానే తలుపు తెరుచుకుని కేడెట్సందరూ దిగి ఆమె చుట్టూ మూగారు.

"పాపం! వంటరిగా వెళుతుంది కాబోలు."

"ఫిట్ వొచ్చి పడిపోయింది."

"ముసలామెకు పక్షవాతం వొస్తుందేమో?"

"పట్నండ్రా! పై వూళ్ళో ఆస్పత్రిలో చేరుద్దాం." రూప ముసలామె కళ్ళజోడు, సంచి తీసుకుంది. నలుగురు కాడెట్లు ఆమెను తీసుకుని వెళ్ళి సీటు మీద పడుకోబెట్టారు.

బస్సుతో పాటు వచ్చిన ఐ. టి. డి. సి. గైడ్ "అరె! చెకింగ్ వస్తే ప్రమాదం! ఇలా ఎవరినిబడితే వాళ్ళను జేర్చుకోగూడదు." అన్నాడు.

ముసలమ్మ నడిరోడ్డున పడి గిలాగిలా కొట్టుకుంటుంటే ...

వస్తాము? చెకింగ్ వస్తే మేము అడుగుతాంలే!" అంటూ సుందరి విదిలించి కొట్టిందతన్ని.

రూప వెళ్ళి డ్రైవర్‌తో ఏదో మాట్లాడి వచ్చింది. గైడ్ "పైవూరే పక్షితీర్థం. అక్కడ దింపేద్దాం ఆమెను." అన్నాడు.

అతని వంక కోపంగా చూసారంతా! చేతిలో మాగజైన్‌తో ముసలమ్మకు విసరసాగింది సుందరి. బస్సు ఆగింది. "ఏమిటి ఇక్కడ ఆపావు? కొండ దగ్గరకు పోనీయ్! పక్షులు వచ్చే టైమయింది." అన్నాడు గైడ్ డ్రైవర్‌తో.

"ఆమె పర్సు, మెళ్ళో గొలుసూ పోయాయట! పోలీస్ కంప్లెయింట్ ఇవ్వటానికి వెళ్ళింది" అన్నాడు స్టేషన్‌లోకి వెడుతున్న రూపను చూపుతూ డ్రైవర్.

"ఇలా చీటికి మాటికి బస్సాపితే ఎలా? పక్షులు ఆట్టేసే వుండవు కష్టపడి కొండ పైకెక్కాక పక్షులు వచ్చి వెళ్ళాయని చెబితే వుసూరుమంటారు" గైడ్ గొణుక్కోసాగాడు.

ముసలమ్మలో ఏదో కదలిక వచ్చి లేచి కూర్చుంది. సంచి, కళ్ళజోడు కోసం కాబోలు చుట్టూ చూసి కనపడక పోయేసరికి లేచి బస్సు వాకిలి దగ్గరకు నడవసాగింది. సరిగా ముసలమ్మ బస్సు వాకిలి వద్దకు వచ్చేసరికి పోలీస్ స్టేషన్ నుండి యిద్దరు కాన్‌స్టేబిల్స్ పరిగెత్తుకు వచ్చి ఆమెను పట్టుకున్నారు.

అప్పటి దాకా నీరసంగా వున్నట్టు పడి వున్న ముసలమ్మ ఒక్కసారిగా ఇద్దరు కాన్‌స్టేబిల్స్‌నూ విదిలించుకు పరిగెత్తసాగింది.

రూప కాలు ముసలమ్మ మోకాలుకు అడ్డం తగిలి బొక్కబోర్లా పడిపోయిందామె. కాన్‌స్టేబిల్స్ పరుగున వచ్చి ముసలమ్మను వొడిసి పట్టుకున్నారు. ఈ సారి ఆమె రెండు చేతులకు బేడీలు వేసి పట్టుకున్నారు బోనులో పడ్డ నక్కలా తెగగుంజుకోసాగింది ముసలమ్మ. మద్రాసు నుండి పోలీసు జీపు వచ్చి స్టేషన్ ముందాగింది. జీపును చూడగానే ముసలమ్మ కెవ్వున కేక వేసి ఒక కాన్‌స్టేబిల్‌ను కరిచి అతను బేడీలు వదలడంతో రెండో అతని చేతిలోని బేడీలు గుంజుకుని పక్క రోడ్డున పడి పరిగెత్తటం మొదలెట్టింది.

జీపులోంచి దిగిన పోలీసులు, స్టేషన్‌లోని పోలీసులు ముసలిది పరిగెత్తిన రోడ్డున పడి పరిగెత్తారు. అరగంట వున్నాక తెల్లముఖం వేసుకొని తిరిగి వచ్చారంతా! అందులో ఒకతని చేతిలో ముసలమ్మకు వేసిన బేడీలున్నాయి! ఇంకోతను ముసలమ్మ కట్టుకున్న చీర, రవిక, విగ్గు పట్టుకొచ్చాడు.

"ఇదంతా చింటూగాడి పనే సార్! క్షణంలో కళ్ళు గప్పి పారిపోయాడు" అంటూ జీపులో కూర్చున్న సర్కిల్‌తో చెప్పాడు బేడీలు తెచ్చిన పోలీసు.

"వాడు ఏ తాళాన్నయినా క్షణంలో తీస్తాడు. ఇదివరకు వాడికి ఏన్నో మార్లు బేడీలు వేసారు. చిట్టెలుక వల తాడు కొరికినట్లు క్షణంలో ఏమార్చి బేడీలు తొలగించుకుని పారిపోయేవాడు.

ముసలమ్మ వేషం వేసుకున్నాడు గనుక ఇక్కడ స్టేషన్‌లో పోలీసులు గుర్తుపట్టలా! లేకపోతే జాగ్రత్తగానే వుండేవాళ్ళు.

జరిగిన కథ- 3: రాఘవరావు, శివానంద మంచి స్నేహితులే కాక బిజినెస్ పార్టనర్స్ కూడా. శివానంద్ భార్య గిరిజ ఆడపిల్లని ప్రసవించిన రోజే రాఘవరావు భార్య వనజ మగపిల్లవాడిని ప్రసవించింది. శివానంద దంపతులు మరణించగా వాళ్ళ పాపకు రూప అని పేరు పెట్టి తమ కుమారుడైన స్వరూప్‌తో సమానంగా ఆ పాపను పెంచసాగారు రాఘవరావు దంపతులు. రాఘవరావు పాపను డాలీ అని ముద్దుగా పిలవసాగాడు. డాలీ పేరుతో ద్రాక్షతోట కొని దాని అజమాయిషీ నాగయ్యకి అప్పగించగా నాగయ్య మోసగించాడు. నాగయ్యను ద్రాక్షతోటలోంచి పంపించేస్తాడు రాఘవరావు. రాఘవరావు కొడుకు స్వరూప్‌ని ఎవరో అపహరించుకొని పోతారు. అది నాగయ్య పని అయి ఉంటుందని రాఘవరావ్‌కి అనిపించింది. నాగయ్య, స్వరూప్‌ల జాడ తెలియలేదు. డాలీ పెరిగి పెద్దదయింది.




"మీకు బుద్ధి లేదోయ్! చేతికి చిక్కిన బద్మాష్‌ను వదిలి కబుర్లు చెబుతున్నారు. పొండి పోయి వూరు నాలుగు మూలలూ గాలించి వింటూ గాడెక్కడ దాక్కున్నా పట్టుకు రండి" అంటూ కేకలు పెట్టి జీపు దిగి స్టేషన్ లోపలకు వెళ్ళాడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్.

* * * *

పక్షితీర్థం (తిరువళ్ళికుంద్రం) బోర్డు చదువుకుంటూ కొండ పైకి ఎక్కసాగారు రూపతో వచ్చిన కేడెట్స్.

"నేను ఇది వరకు చూసాను! మీరు వెళ్ళి చూసి త్వరగా రండి" అంటూ సువర్చలా మేడమ్ కిందే కూర్చున్నారు.

పది మెట్లెక్కగానే "ఆ! అయిదు వందల మెట్లెక్క లేక ఇదివరకు చూసానని తప్పించుకున్నారు మేడమ్" సుందరి మెల్లిగా అన్నా ఫక్కున పెద్దగా నవ్వారంతా. సుందరి కామెంట్ వినని సుశీల మేడమ్ "ఏమిటి అలా నవ్వుతార"న్నట్లు చూచింది వారి వంక.

"ఆ! యీమెట్లను చూచి భయపడితే ఎలా! మంగళగిరి మెట్లు ఎన్ని మాట్లు ఎక్కి దిగలేదు?" అంది సుందరి షళ్ళీ సుశీల మేడమ్‌ను ఏమార్చటానికి.

"మంగళగిరిలో రెండు వందల యాభై మెట్లు మాత్రమే! ఇక్కడ రెట్టింపు మెట్లు ఎక్కాలి" అంది రూప.

"సీ ఐ. ఏ. యస్. ఆలోచనలతో. చచ్చిపోతున్నామే?" పక్కున నవ్వింది సుందరి. సుందరి నవ్వుతో శ్రుతి కలుపుతూ గలగలమని నవ్వారంతా! బిచ్చం వెయ్యమని దక్షిణాది భాషలన్నీ కలగాపులగం చేస్తూ మెట్ల పక్కన కూర్చున్న బెగ్గర్సు వీళ్ళ నవ్వుల్ని విని ఆశ్చర్యంగా నోరు తెరుచుకు చూస్తూ బిచ్చ మడగటం మర్చిపోయారు!

వంద మెట్లెక్కేసరికి జోక్సు, నవ్వులూ పోయి శ్వాస పీల్చటం కష్టమయి రొప్పుతూ చెమటలు పట్టి పళ్ళ బిగువున నడువసాగారు. పిక్కలు పట్టి కుంటుతున్నట్లు అనిపించింది. 'అలుపు వచ్చింది' అంటే ఎక్కడ నవ్వుతారోనని ఎవరికి వారు గప్‌చిప్‌గా వుండిపోయారు.

"మధ్యలో కూర్చోకుండా పైకి ఎక్కితే పుణ్యం రాదు" చటుక్కున మెట్లు మీద చతికిలబడిపోతూ అంది సుందరి. రొప్పుతో మాటలు రావటం లేదామెకు. సుందరి కూర్చోవటానికి ఇలా అంటుందని తెలిసినా ఎవరూ ఆమె మాటలకు ఎదురు చెప్పలేదు. అంతా ఆమె చుట్టూ కూర్చుని అలసట పోగొట్టుకుంటూ, దీర్ఘ ఉఛ్వాస నిశ్వాసాలు వదులుతున్నారు.

బంటూ (బసవ రాజేశ్వరి) పిప్పర్‌మెంటు బిళ్ళలు తీసి అందరకూ ఇచ్చింది. "థాంక్స్ బంటూ" అంటూ అంతా ఆమె చుట్టూ మూగారు.

"పక్షులొచ్చాయి" అంటూ పైన అరుపులు వినపడటంతో అంతా పరుగెడుతూ మెట్లెక్కిపోయారు. పక్షుల్ని చూడాలన్న ఉత్కంఠతతో అలుపుసరకు గొనలేదు వాళ్ళు. కొండ పైభాగం దగ్గర మెట్లు రెండు దిశలుగా చీలి వుండటం గమనించకుండా ఎదురుగా వున్న దారిన పరిగెత్తారు వాళ్ళు.

కొండపైన సమతల ప్రదేశంలో రేకుల షెడ్లు, బంగళా పెంకుటి షెడ్లు వేశారు. అప్పటికే అవి యాత్రికులతో నిండి వున్నాయి. షెడ్ల ముందు ఇనుప ఫైపులు కటకటాల మాదిరి కట్టారు. జనం వొకరి నొకరు తోసుకుంటూ చూడసాగారు.

"శీలా... వికసించిన చాయతో వెలిగిపోతూంది
నీ ముఖ సొగసు.. చూసిచూసి
మతితప్పి పారేసుకున్నా
నా మనసు!"



# ఇతర్లు గుర్తించేలాంటి మెరుగైన వంటి ఛాయను షీలాకి సహజంగా, మృదువుగా సమకూర్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ... అదెలాగో చదవండి.



పెళ్లి కూతురయ్యేది ఒక్క రోజే, కాని భార్యగా వుండేది జీవితాంతం! ఇది అర్థం చేసుకునే, షీలా, పెళ్లయ్యాక కూడా ఫెయిర్ అండ్ లవ్‌లీ ప్రతి ఉదయం, రాత్రి ఉపయోగిస్తూనే వుంది. ఎందుకంటే, వికసించిన వంటి ఛాయ అనే ఓ అమూల్య కానుకని షీలాకి ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ—దాన్ని జీవితాంతం నేస్తంగా ఉంచుకోవాలని ఆమె కోరిక. పెళ్లయి ఎన్నో పౌర్ణమి రోజులు గడిచినా, మీ ఆయన ఇప్పటికీ హనీమూన్ మోహంలోనే మునిగి వుంటే, మీరు మాత్రం ఆ సౌందర్య నిధిని వదులుకుంటారా?

షీలా లాగే మీరు కూడా 'తెల్లని వంటి ఛాయ' అనే కలని నిజం చేసుకోవచ్చు—ఫెయిర్ అండ్ లవ్‌లీతో.

## ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం

ఫెయిర్ అండ్ లవ్‌లీ. మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయ నివ్వడానికి దీనిలో వుంది ఓ సాటిలేని ఫార్ములా—ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది. ఒకటి, ఇది చర్మం అడుగున పనిచేసి శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో. రెండు, దీని డబల్ సన్‌స్క్రీన్ చర్య, లోనికి చొచ్చుకుపోయి నల్లబరిచే సూర్య కిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది. అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్తచర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి. మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తుంటే, మీ వంటి ఛాయ ఎంతో అందంగా, మృదువుగా, తెల్లగా అలాగే నిలిచి వుండటం ఖాయం.



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడక ముందు



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడిన తర్వాత



## ఉపయోగించే పద్ధతి

ముఖం, మెడ, చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి. ఇప్పుడు వేళ్లను ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిముజిములాడవచ్చు. భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది.

## సులభంగా లోనికి ఇంకుతుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీ ఇంతకు ముందుకన్న ఇప్పుడు మృదువుగా, నేవళంగా ఉంటుంది. అది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోనికి ఇంకుతుంది. త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు...కంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి:
శ్రీమతి కవితా కుమార్, ఫెయిర్ అండ్ లవ్‌లీ అడ్వయిజర్,
పో.బా. బాక్స్ 758, బొంబాయి-400 021.

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**
**వంటి ఛాయ మెరుగుపరిచే క్రీమ్**




**వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!**

## సంకెళ్లు వరికి?

తినిపిస్తున్నాడు పూజారి. ఆ పక్షులు ఏ జాతివో అర్థం కాలేదు సుందరికి ఆ మాటే సుశీలా మేడమ్‌ను అడిగితే మాట్లాడవద్దని చూపుడువేలు నోటిమీద వుంచి సైగ చేసింది.

పక్షులు రెండు తెల్లగా నాటు కోళ్ల మాదిరిగా వున్నాయి. కొంచెంసేపు పూజారి పెట్టిన ప్రసాదం తిన్నాక ఒక పక్షి తల పక్కకు తిప్పి అటూ యిటూ చూసి ఉత్తర దిశగా ఎగిరి పోయింది నిముషమున్నాక రెండో పక్షి కూడా రెక్కలు విదుల్చుకుని దక్షిణ దిశగా ఎగిరి పోయింది.

'ఒకటి కాశీ, ఒకటి రామేశ్వరం వెళతాయి." అంది బంటూ.

నేస్నమ్మను' పక్షులు అన్ని వేల మైళ్ళు వెళ్ళి మళ్ళీ తిరిగి రాగలవా?"

జనం ఒక్కసారిగా ముందుకు వెళ్ళిపోసాగారు.

పక్షులు తినగా మిగిలిన ప్రసాదాన్ని పూజారి డబ్బులు తీసుకుని పంచుతుంటే ఎగబడ్డారు జనం. కొంతమంది పక్షులు ప్రసాదాన్ని ఆరగించినచోట సాష్టాంగ దండ ప్రణామాలు చేయసాగారు. కొంతమంది అక్కడ రాళ్ళ మధ్య వున్న దొరువులో పాకుడు పట్టి వున్న నీరు పాత్రలలోకి తీసుకోసాగారు.

గోల్డ్‌స్పాట్ అమ్మే అతని దగ్గర జనంలో జొరబడి సీసా తెచ్చుకుని ఓ పక్కగా నిలబడి తాగుతున్నది బంటూ స్థూలకాయం కావటంతో మెట్లెక్కిన అలుపు తగ్గలేదామెకు.

"దొంగ! దొంగ" బంటూ అరుపులకు సుశీల మేడమ్‌తో సహా కాటెట్లందరూ గుమిగూడారు.

మిగిలిన యాత్రికులు భాష అర్థం కాక ఆశ్చర్యంగా చూడసాగారు.

వంటిమీద నిక్కర్ తప్ప మరేమిలేని యువకు డొకడు అంతకుముందే మెట్లు దిగి చకచకా వెళ్ళిపోవడం చూచింది రూప

రెండో వైపుగా కిందకు పరిగెత్తిం దామె. ఆ వైపు మెట్లు గాకుండా రోడ్డులా వేసి వుంది కొండమీద దారి. రూప శక్తి అంతా కూడదీసుకుని లేడిలా పరిగెత్తింది. దారిలో శివాలయం, శాసనాలూ దాటుకుని మెట్ల దగ్గరకు వచ్చేసరికి నిక్కర్ వేసుకున్నతను మెట్ల మీదుగా కిందకు పరిగెడుతున్నాడు. పరిగెత్తుకు వెళ్ళి డాష్ ఇచ్చినట్లు అతని కాళ్ళమీద తన్నింది రూప. అతను లేచేలోపే మెడమీద కరాటే ఛాప్ ఇద్దామని ఆమె అనుకుంది: కాని అతని ముఖం చూడగానే రూప చేతులకు పక్షవాతం వచ్చినట్లు చచ్చుబడ్డాయి.

వయసులో వున్నప్పుడు, ఆమె తండ్రి, రాఘవ అంకుల్ కలసి తయించుకున్న ఫోటో ఆమె గదిలో వుంది. ఆ ఫోటో ఎంతో అపురూపంగా ప్రపరచాడు అంకుల్. నిక్కర్ వేసుకున్న అతని ముఖం అచ్చు అంకుల్ చిన్నప్పటి ఫోటో లోలా వుంది' అంటే? ఇతను చిన్నప్పుడు తప్పిపోయిన స్వరూప్ కాదు గదా?

ఆలోచనల లోంచి తేరుకుని అతని వద్దకు వెళ్ళేసరికె అతను లేచి ఎస్ప్రెస్ గుండులా ముందుకు దూసుకు పరుగెత్తాడు.

పాపం ఇంత శ్రమా దక్కలేదతనికి' బంటూ మెళ్ళో బంగారు గొలుసు అతను పడిన చోట వున్నది గొలుసు చేతిలో తీసుకొని చూస్తుంటే మిగిలిన కాడెట్సు, సుశీల మేడమ్ దిగి వచ్చారు

గొలుసు చూడగానే అమ్మయ్య' అమ్మ ఎన్ని తిడుతుందో అని భయపడ్డాను ఇక ఫర్వాలేదు' అనుకుంటూ ఎప్పర్‌మెంట్ నోట్లో వేసుకుని చప్పరించసాగింది బంటూ'

మూల మీద కూర్చున్న బిచ్చగాడు, దొంగాడు పరిగెట్టి పోతుంటే అమ్మాయిగారు వచ్చి ఒక తన్ను తన్నారు. దొంగాడు కంపపడి ఎల్లిగంతులు పెట్టి కిందకు పారిపోయాడు. వాడి జేబులో గొలుసు కాస్త కంచ పడిపోయింది అని అచ్చు తెలుగులో చెప్పాడు. అంతమంది తెలుగు అమ్మాయిల్ని చూడగానే వాడు వుషారుగా జరిగిన విషయం చెప్పాడు లేకపోతే సాధారణంగా వాడు తెలుగులో మాట్లాడడు.

"ఇవ్వాళ అప్పుడే రెండో సారి సి. ఐ. డి. పని చేసావు' నువ్వు ఐ ఏ యస్ కు వెళ్ళేకంటే ఐ.పి.యస్. పరీక్షకు వెళ్ళరాదా" అంది సుందరి.

"పొద్దున ముసలమ్మ మారు వేషం వేసుకున్న దొంగ అని ఎలా కనుక్కున్నావు?" అడిగింది రాజి.

అయిష్టంగానే సమాధాన మిచ్చింది రూప.... "ముసలామె అలా హఠాత్తుగా నడి రోడ్డున పడి పోవడం ఎదో అసహజంగా అనిపించింది నాకు. ఆమె కళ్ళ జోడూ సంచీ నా దగ్గర వుంచారు అంకుల్ కళ్ళ జోడు అప్పుడప్పుడూ పెట్టుకుని చూస్తుండేదాన్ని తమాషాకు! అలాగే ముసలామె కళ్ళజోడు పెట్టుకు చూడసాగాను. నాకు అంతా మామూలుగానే కనపడ సాగింది. అంటే అవి ప్లెయిన్ గ్లాసులని అర్థమయింది. పెద్ద వాళ్ళు పెట్టుకునే గ్లాస్‌లు సాధారణంగా వస్తువుల్ని మాగ్నిఫై చేస్తవి ముసలామెకు యీ కళ్ళజోడు పెట్టుకున్నందువల్ల కలిగే వుపయోగం ఏమిలేదని తెలియగానే ఇవి ఏదో మోసం చేయటానికి పెట్టుకున్న బాపతు అని తెలిసింది. సరే ఇక సంచిలో ఏముందో అని ఎవరూ చూడకుండా పరీక్ష చేయసాగాను. బంగారు నగలు పాత గుడ్డ పేలికల్లో మూటలు కట్టి వున్నాయి. ఇదేదో దొంగిలించిన సొమ్ము అని అర్థం అయింది.

మన బస్సు ముందు అలా పడిపోయి మనని మోసం చేసి బస్సెక్కటంతో






దొంగ ఏదో పెద్ద హడావిడిలో వున్నారు (ది) అని అర్థం అయింది. బహుశ పోలీసులు వెంట తరుముకు వస్తున్నారని అనుకున్నాను.

అందుకే డ్రైవర్ దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా అతనితో నా పర్సు, మెళ్ళో గొలుసూ పోయాయి.... స్టేషన్‌లో రిపోర్టివ్వాలి! మిగిలిన పాసెంజర్లను చెక్ చేస్తే అవి దొరుకుతాయి అని చెప్పాను. అతను నా మాటలు నమ్మి మాట్లాడకుండా బస్సును పోలీసుస్టేషన్ ముందు ఆపాడు. తర్వాత కథ మీకు తెలిసిందే!" ముసలమ్మ వేషం వేసుకున్నతనే బంటూ గొలుసు కాజేసాడని మాత్రం బయటకు చెప్పలేక పోయింది రూప!

ఐ.టి.డి.సి. బస్సు మహాబలిపురం వేపుగా వెళ్ళసాగింది. పక్షితీర్థం కొండమీద చారిత్రక విశేషాలను గైడ్ చెప్పసాగాడు కాని వుదయం నుండి తగిలిన డబుల్ షాక్స్ నుండి కోలుకోని కేడెట్సు అతని మాటలు వినిపించుకోటం మానేసారు. అందరి మనస్సుల్లోనూ ఒకటే ఆలోచన– రూప ధైర్యం, తెలివి, సమయస్ఫూర్తి, ఎలాక్రిటీ గూర్చి ఆలోచిస్తున్నారంతా!

మహాబలిపురం బీచ్, పంచ పాండవుల రథాలు, సముద్రపు వొడ్డున దేవాలయాలూ తిరిగి చూసి కాంటీన్‌లో భోంచేసి బస్సెక్కి మద్రాసు తిరుగు ప్రయాణ మయ్యారు.

రూప మనసులో ఒకటే ఆలోచన. "దొంగ" ముఖం మామయ్య చిన్నప్పటి (వయసులో వుండగా) ముఖంలా వుందేమిటి? అతను స్వరూప్ కాదు గదా? మనిషిని పోలిన మనిషి వుంటాడంటారు. తను పొరపడిందేమో?

"హలో మిస్ షెర్లాక్‌హోమ్స్" అంటూ సుందరి చెవులో అరిస్తే గాని రూపకు బాహ్య స్మృతి రాలేదు. చూస్తే బస్సు మద్రాసు మెరినా బీచ్ దగ్గర ఆగి వున్నది!

"ఇంత పరధ్యానంగా వుంటే పోలీస్ ఆఫీసర్‌గా పనికి రావమ్మాయి!" భుజాన్ని గట్టిగా కుదుపుతూ అంది సుందరి.

బలవంతాన ముఖాన చిరునవ్వు పులుముకుని అందరితో పాటు మెరినాబీచ్‌లోకి వెళ్ళింది రూప.

చీకటి పడేవేళకు టూరిస్ట్ బస్ కాంపు ముందాగింది.

విజయవాడ గర్ల్స్ కాలేజీ నుండి వచ్చిన కాడెట్సు అంతా బిలబిలమంటూ లోపలకు వెళ్ళారు. మర్రోజు తిరుగు ప్రయాణం!

ఆ రాత్రి కాంప్ ఫైర్! టెంట్లు పీకి పందిరి వేసినంత పని చేసారా రాత్రి. తెల్లవారిందాకా పాటలూ, డాన్సులూ, జోకులూ, కళ్ళెంలేని గుర్రాల్లా గంతులేస్తూ గడిపారు. ఈ గందరగోళానికి దూరంగా ఒక మూల కూర్చుని దీర్ఘాలోచనలో మునిగిపోయింది రూప.

పక్షి తీర్థంలో తారసపడిన వ్యక్తి (దొంగ) స్వరూప్ అని ఆమె మనసులో పదే పదే అనిపించ సాగింది.

చిన్నతనం నుండీ తనను ప్రాణం కన్న మిన్నగా చూసుకుంటూ వచ్చిన అంకుల్, ఆంటీ గుర్తుకొచ్చారు. తను పుట్టగానే మరణించిన అమ్మా నాన్నా, అంకుల్ ఆంటీల స్నేహం గురించి విని వున్నది. త్యాగానికి మారు పేరైన అపురూపమైన స్నేహ బంధం వారిది!

ఆంటీ ప్రాణాలు రక్షించే ప్రయత్నంలో బలైపోయాడు నాన్న! ఆ షాక్ తట్టుకోలేక చనిపోయింది అమ్మ! కన్న బిడ్డను కోల్పోయి కూడా దిగులును దిగమింగి ఏ లోటూ లేకుండా పెంచారు అంకుల్ ఆంటీ తనను! కాని వారిద్దరి మనసులలో ఒక ఆరని జ్వాల రగులు తూందని తెలుసు తనకు! వారిరువురి హృదయాలు బడబాగ్ని దాచుకున్న శోక సముద్రాలు.

చిన్నప్పుడు తప్పిపోయిన స్వరూప్ ఎక్కడ వున్నా సరే కనుక్కొని తీసుకొని వచ్చి అంకుల్ ఆంటీలకు అప్పజెపితే గాని తను వారి రుణం తీర్చుకోలేదు!

ఇక నుండి తన జీవితధ్యేయం వొకటే! స్వరూప్ వునికి కనుక్కోవటమే మొదటి కర్తవ్యం! అలా మనసులో నిర్ణయించుకున్నాక రూప మనసు తేలిక పడింది.

చేతి వాచీ చూసుకుంది రూప. తెల్లవారు జాము మూడు గంటలయింది. నెమ్మదిగా నడుచుకుంటూ అస్తవ్యస్తంగా పడి నిద్రపోతున్న స్నేహితురాండ్ర మధ్యగా వెళ్ళి తన చోటులో పడుకుంది రూప. కటిక నేలమీద పరచిన రగ్గు మీద పడుకోగానే నిద్ర పట్టిందామెకు!

(ఇంకావుంది)



"సక్కనోడు"లో విజయశాంతి



రజని, "మారుతీ"లో




## విడుదలకు సిద్ధమైన "సక్కనోడు"గా శోభన్‌బాబు

"గ్రామీణ వాతావరణంలో పెరిగిన సక్కనోడుగా శోభన్‌బాబు, మహానగరంలో పుట్టి పెరిగిన పక్కనమ్మగా విజయశాంతి ముచ్చటైన జంటగా కనిపిస్తారు. జులై 25కి షూటింగ్ పూర్తయింది." అన్నారు బి. భాస్కరరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కందేపి సత్యనారాయణ నిర్మించిన రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ వారి పై చిత్రంలో గొల్లపూడి, గిరిబాబు, హేమసుందర్, ఎస్.వరలక్ష్మి, అన్నపూర్ణ, మాస్టర్ హరి, ఉమామహేశ్వరరావు, డాక్టర్ మదన్‌మోహన్ నటించారు. గొల్లపూడి సంభాషణల కర్త. కె. వి. మహదేవన్ స్వరకల్పనలో సిరివెన్నెల సీతారామశాస్త్రి, రాజశ్రీ, గోపి గీతాలు రాశారు. వి. సురేష్ ఛాయ, కళాధర్ శిల్పం, వేణు ప్రొడక్షన్, కె. సత్యం కూర్పుతో గాడ సత్యం ప్రొడక్షన్ కంట్రోలర్.

## విజయ నిర్మల దర్శకత్వంలో "పవిత్ర పాపి"

"కొండముది శ్రీరామచంద్రమూర్తి నవల. నరేష్ పక్కన ఒక ప్రముఖ తార నటిస్తుంది" అన్నారు విజయనిర్మల. ఈమె దర్శకత్వంలో కృష్ణ సమర్పించే పై చిత్రంలో కోట శ్రీనివాసరావు, సంయుక్త, నిర్మల తదితరులు నట వర్గం. రాజ్ కోటి సంగీతం. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, ఆదుర్తి హరనాథ్ కూర్పు తెర వెనుక హంగులు.

## కృష్ణ, కీర్తి జంటతో విజయనిర్మల దర్శకత్వంలో "దంపతులారా వర్ధిల్లండి!"

"చక్కని ఫామిలీ సెంటిమెంట్. ఆగస్టు నెలాఖరు నుంచి షూటింగ్" అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఏ. పద్మనాభం నిర్మించే మల్లికా తిలకం మూవీస్ వారి పై మూడవ చిత్రంలో కృష్ణ సరసన కీర్తి నాయిక. గిరిజశ్రీ భగవాన్ కథకు సత్యానంద్ సంభాషణలు రాస్తున్నారు.

## ఆగస్టులో "శ్రీ వేమన చరిత్ర"

విజయచందర్ కొన్ని పాత్రలు ధరించడానికే పుట్టారు. అలాంటి పాత్రలలో వేమన ఒకటి. ఉత్తమాభిరుచి గల నిర్మాత మండవ గోపాలకృష్ణ నాలుగేళ్లపాటు వేమన గురించి కూలంకషంగా పరిశీలించి, ప్రతి ఆంధ్రుడూ గర్వించే రీతిలో చిత్ర నిర్మాణానికి పూనుకొన్నారు. "వేమన చిత్రానికి సంభాషణలు రాయడంతో నా జీవితం సార్థకమయింది." అన్నారు మోదుకూరి జాన్సన్. సత్యం ప్రత్యేకించి పద్యాలకు కూర్చిన సంగీతం ఎంతో గొప్పగా ఉంది. సిద్ధహస్తులు పి. ఎస్. రావ్, బి. యి (లిట్.) దర్శకత్వంలో సాంకేతికపరంగానూ అత్యుత్తమ స్థాయిలో ఉన్న రాధామాధవ చిత్రవారి పై చిత్రంలో చంద్రమోహన్, అర్చన, కె. ఆర్. విజయ, కల్యాణ్‌కుమార్, ధూళిపాళ, డాక్టర్ తంబు, జీవా, ఎస్. వరలక్ష్మి, పద్మ, విజయలక్ష్మి, త్యాగరాజు, సాక్షి రంగారావు, శ్యాంబాబు, మోదుకూరిసత్యం, మునిలాల్, గౌరవ పాత్రలలో జగ్గయ్య, నారాయణరావు కనిపిస్తారు. హరి అనుమోలు ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, పసుమర్తి కృష్ణమూర్తి నృత్యాలు, ఉమాశంకర్ కూర్పు, వి. ఎస్. రంగస్వామి సంయుక్త దర్శకత్వం, వాసపల్లి బ్రహ్మాజీ నిర్మాణ సారథ్యంతో పద్మారావు నిర్వహణ బాధ్యతలు వహించారు.

( 63 వ పేజీ చూడండి)

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



ఏ. అనిత, పెద్దపల్లి

వరకట్నంపై మి అభిప్రాయ మెమిటి?

వరకట్నం నిర్మూలించడానిక తగిన జాగ్రత్తలు తీసుకోమని పెద్దల్ని, వరకట్నం తీసుకుని వివాహాలు చేసుకోవద్దని యువతరాన్ని కోరడమే నా అభిమతం.

కోట నాగేశ్వరరావు, ధర్మవరం

ముద్దుల క్రిష్ణయ్య" చిత్రంలో మి పాత్ర చాలా బాగుంది. చివరి సన్నివేశంలో లాగా సినిమా నటమణుల పరిస్థితులు అలా వుంటాయా?

మిరు చూసింది – "సినిమా"

సినిమా వేరు "జీవితం" వేరు.

సినిమాల్లోలాగా జీవితాల్లో జరగాలని లేదు. జీవితాల్లోని కొన్ని పాత్రలు మాత్రం సినిమాల్లో ఉంటాయి.

ఎ.యస్. రంగనాయకులు, డోను

హైదరాబాదుకు చిత్రసీమను తరలించటంలో హీరోలు ముందడుగు వేస్తున్నా హీరోయిన్ల కృషి కన్పించటం లేదు. ఇది నిజమని ఒప్పుకుంటారా?

మిరడిగింది చాలా మంచి ప్రశ్న! అయితే యీ ప్రశ్న నన్ను అడగాల్సింది కాదంటే మిరు ఏమంటారు?

పి. ధరమ్, రాయవరం

నటనకు వారసులు – కొడుకులు.
మరి పదవులకు వారసులు– ?

రాజకీయాల గురించి ప్రశ్నించారు బాగుంది. అయితే వాటి గురించి చెప్పే వయసు– ఇంకా నాకు రాలేదుగా?

యం. శ్రీనివాసరావు, విజయనగరం

ఈ కాలం కుర్రవాళ్ళని తల్లి తండ్రులు కష్టపడి చదివిస్తే వాళ్ళు చదువుకన్నా సినిమాలకే ఎక్కువ విలువ యిస్తారు. ఎందుకు?

మిరడిగిన ప్రశ్నలో నే వుంది– ఈనాడు సినిమా మిడియా ఎంతో పవర్‌తో కూడుకుందని, యువతరం చెబుతుందని. అయితే చదువుని అశ్రద్ధ చేయవద్దని మాత్రం నన్నభిమానించే నా అభిమానులకు తెల్పుతున్నాను.

కె. చంద్రకుమారి, విజయవాడ – 3

ఈ రోజుల్లో హౌస్‌ఫుల్ కాకపోయినప్పటికి "హౌస్‌ఫుల్" అని బైట బోర్డు పెట్టి మిలాంటి హీరోయిన్‌ల విలువ పెరగటానికి అలా పెడుతున్నారని నేను అంటాను. మి సమాధానం?

ఇందుకు నేను ఎంత మాత్రం ఒప్పుకోను. చీదితే వూడిపోయే ముక్కును ఎన్నాళ్ళు పట్టుకు కూర్చోగల మంటారు?

ఉదయ్‌కుమార్, ఇసుకపల్లి

సెక్స్ గురించి సినిమాలే కాకుండా, విద్యా సంస్థలు కూడా తెలియ జేయాలను కుంటున్నాయి. యువతీ యువకుల ఆరోగ్యాలకు అది అంత మంచి దంటారా?

పాశ్చాత్య దేశాల్లో యీ విధానం ఏనాడో అమలులో వుంది. మనది భారత దేశం. సత్‌సాంప్రదాయాలకు మన దేశం నిలయం. ఇటువంటి చక్కని దేశంలో పుట్టిన మనం వీటి గురించి తెలియని వయసులో వున్న వారికి వాటి గురించి చెప్పడం వలన "తెలియ జెప్పడం" అవుతుంది. విద్యా సంస్థలో "సెక్స్" గురించి చెప్పాల్సినంత అవసరం లేదని అంటాను.

యస్. మునిస్వామి, కర్నూల్

నేటి సమాజంలో "కళ" మనిషికి ఉపయోగమా? మనసుకు ఉపయోగమా?

"కళ" అన్నది మనిషిలోని "మనసు"ను రంజింప జేస్తుంది. రాగరంజితుల్ని చేస్తుంది.

—. రాజ్యలక్ష్మి, రేపూరు

మిరు మి పేరుకు తగినట్లుగానే మి ముఖంలో ఎల్లప్పుడూ శాంతిని కనబరుస్తూనే అఖండ విజయాల్ని సాధించేస్తున్నారు. ఇంకా గొప్ప విజయాల్ని సాధించాలని మి అభిమానిగా నా కోరిక

మి అభిమానానికి కృతజ్ఞురాల్ని. మి కోరికను యీ ఏడు కూడా తర్చగలనని అనుకుంటున్నాను.

యు. నరశింహులు, దొమ్మరనంద్యాళ

మనిషి దొంగగా మారడానిక కారణం – క్రమశిక్షణతో పెంచని వారి తల్లి తండ్రులే అని నా వుద్దేశ్యం. మిరే మంటారు?

కాదని అంటాను. బిడ్డను పెంచి.... పెద్ద చేసే ప్రతి తల్లి– తండ్రి తమ బిడ్డ అందరికన్నా మిన్నగా వుండాలని కోరుకుని ఆ బిడ్డని తమ కళ్ళల్లో పెట్టుకుని పెద్ద చేస్తారు. విద్యాబుద్ధులు నేర్పిస్తారు. అయితే ఆ బిడ్డ దొంగగా మారడానికి ముఖ్యంగా అతను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే తల్లి– తండ్రులు కాదు. అతని సన్నిహితులు. □

గమనిక:–
ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు– సం

---

కూపన్

## ఆంధ్రసచిత్ర వారపత్రిక
## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

పంపిన వారి పేరు : ____________________

పూర్తి చిరునామా : ____________________

# ఆడపిల్ల తండ్రి

తిరుమలశ్రీ

రాగ రంజితమయిన ప్రియురాలి వదనంలా అరుణిమ దాల్చుకుంటోంది సాయం సంధ్య.

నీలి నీడల మేలి ముసుగును సవరించు కుంటోంది ప్రకృతి కాంత.

పార్కులోని అందమైన తరులతాదులు వృద్ధ భాస్కరునికి వీడ్కోలు చెబుతూ నిశాకాంతకు స్వాగతం పలికేందుకు సన్నద్ధమవుతున్నాయి

చీకటికి నాందిగా పార్కులో దీపాలు వెలిగాయి

మర్రి చెట్టు క్రింద వున్న సిమెంట్ బెంచి మీద కూర్చున్న నరహరి ప్రకృతి అందాలను ఆస్వాదించడంలేదు. ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయి వున్నాడు

అతని ఆలోచన ఎప్పుడూ ఒక్కటే!

తెగని గొలుసులాంటిది అది

జయంతి పెళ్ళి. !

అహర్నిశలూ అతని బుర్రను దొలిచే ఆలోచన అదే

రోజు రోజుకూ గుమ్మంలా ఎదిగిపోతూన్న జయంతిని చూస్తూంటే దోషిలా ఫీలవుతూంటాడు అతను.

జయంతికి అందం వుంది.

జయంతికి వయసు వుంది.

జయంతికి చదువుంది

లేనిదల్లా డబ్బు ఒక్కటే'

అది కూడా జయంతికి కాదు- నరహరికి'

నరహరి ఎవరో కాదు

జయంతి తండ్రి

కట్నాల పరుగు పందెంలో కొంత దూరమైనా పరుగెత్తలేని నిస్సహాయుడు అతను.

కడుపు కట్టుకుని కూతుర్ని చదివించాడు.

కూతురి అందం చూసి మురిసిపోయాడు.

తెలివి తేటలకు పొంగిపోయాడు

అయితే, అందం చూసి చేసుకునే రోజులు ఇంకా రాలేదన్న సత్యాన్ని మాత్రం విస్మరించాడు

ఆడపిల్ల గుణ గణాలు కట్నం ముందు-సూర్యుడి ముందు దివిటీల వంటివన్న నగ్న సత్యం గుర్తించలేకపోయాడు

ఆడపిల్లకు పెళ్ళి చేయలేని ఓ అసమర్థుడిలా మిగిలిపోయాడు

అసమర్థులందరిలాగే తానూ ఎస్కేపిజం అలవరచుకుంటున్నాడు

ఇంటి పట్టున వుండి కూతురి ముఖం చూళ్ళేక ఎప్పుడూ వూరు పట్టుకుని తిరగడం అలవాటు చేసుకున్నాడు

సాయంకాలం కాసిని టీ నీళ్ళు గొంతుకలో పోసుకుని పబ్లిక్ పార్క్ కి చేరుకోవడం అతని దిన చర్య అయింది.

పార్కులో ఓ బెంచి మీద కూర్చుని వచ్చే పోయే వారిని చూస్తూ తన ఆలోచనలను మరచిపోవడానికి ప్రయత్నిస్తూ వుంటాడు నరహరి

కాని, కన్నుల ముందు కన్నుల పండువుగా తిరిగే యువ జంటలను చూస్తూంటే ఎదలోని వుందు

రేగుతూనే వుంటుంది. జయంతిని వారితో పోల్చుకుని బాధ పడుతూ వుంటాడు.

కనిపించిన వారితో కబుర్లలోకి దిగుతాడు అతను, ఆలోచనలను దూరంగా వుంచేందుకని ఒంటరిగా వుంటే మెదడంతా దొలిచేస్తూ వుంటాయి అవి చెద పురుగుల్లా.

చీకట్లు దట్టంగా క్రమ్ముకోవడంతో చిన్నగా నిట్టూర్చి పైకి లేచాడు నరహరి, ఇంటికి వెళ్ళేందుకని.

అతని నిట్టూర్పుకు కారణం ఇదమిద్ధమని చెప్పడం కష్టం. ఏదైనా కావచ్చును.

జీవన గమనంలో మరో రోజు నిష్ప్రయోజనంగా గడిచిపోయిందన్న నిస్పృహ కావచ్చును.

ఎంతసేపు కూర్చున్నా ఇంటికి వెళ్ళక తప్పదన్న భావన కావచ్చును.

కూతురి ముఖం చూడడం ఎలాగా అన్న బెంగ కావచ్చును.

లేదా- ఆ రోజు కూడా మూర్తి జాడ లేదన్న అసంతృప్తి కావచ్చును.

మూర్తి వారం రోజులుగా కనిపించనందుకు నరహరి అసంతృప్తికి, అశాంతికి గురి కావడంలో ఆశ్చర్యం లేదు.

అలాగని మూర్తి అతనికేదో అవుతాడనుకుంటే పొరపాటే'

మూర్తి నరహరికి ఏమి కాడు.

కాని, రోజూ పార్కులో అతనికి ఎదురవుతాడు'

మూడు నెలలుగా ఒకరి కొకరు సన్నిహితంగా వచ్చారంటే- అందుకు కారణం ఇద్దరూ బాధాతప్త హృదయులు కావడమే!

సుఖాలకంటే మనుషుల్ని కష్టాలే మరింత దగ్గరకు చేర్చుతాయంటే అతిశయోక్తి కాదేమో!

సమస్యలు వేరు కావచ్చును

దారులు భిన్నం కావచ్చును.

కాని, కష్టం అందరిదీ ఒకటే'

ఒకరి బాధను మరొకరికి చెప్పుకున్నట్టయితే హృదయం తేలికపడుతుందంటారు. పైగా తమ బాధల్ని ఇతరులకు చెప్పుకోవడమూ, పరుల కష్టాలను తెలుసుకుని వాటిలో పాలు పంచుకోవడమూ వయసు వుడిగిన వారిలో పరిపాటి.

నరహరి, మూర్తులది అటువంటి పరిచయమే.

అలాగని మూర్తి కూడా నరహరిలాగే ముసలివాడేననుకుంటే పప్పులో అడుగు వేసినట్టే!

మూర్తి వయసు పాతికపైన ఒకటో, అరో వుండవచ్చును

తనకు రెట్టింపు వయసు వున్న నరహరితో అతనికి స్నేహం ఏమిటన్న ఆశ్చర్యార్థకం చూపరుల బుర్రల్లో పెద్దగా నిలుచో వచ్చును.

అందులో వింత ఏమి లేదు.

ప్రత్యేకత అసలే లేదు

ఒంటరితనానికి దూరంగా పారిపోయేందుకని కనిపించిన వారందరితోనూ కబుర్లు కలిపే నరహరికి, మూణ్నెల్ల క్రితం పార్కులో మూర్తితో పరిచయమయింది

సన్నగా, పొడవుగా, చామనచాయ రంగులో వుంటాడు మూర్తి. ముఖం మీద పడే వంకీల జుత్తు, చిరు నవ్వులొలికే పెదవులు- చూడగానే సదభిప్రాయం ఏర్పడేలా వుంటాడు నీటుగా డ్రెస్ చేసుకోవడం అతనికి అలవాటు. లైట్ బ్లూ కలర్ స్కూటర్ మీద వస్తూంటాడు పార్కుకి.

బి.కామ్. పాసయిన మూర్తి ఓ నేషనల్ బ్యాంక్‌లో క్యాషియర్‌గా పని చేస్తున్నాడు. పెద్దగా కుటుంబ సమస్యలేవీ లేవు. ఓ తల్లి, చెల్లాయి తప్ప వేరెవ్వరూ లేరు అతనికి. ఏడాది క్రితమే చెల్లెలికి పెళ్ళయిపోయింది. ప్రస్తుతం అతనికి పెళ్ళికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

కొద్ది రోజులుగా మూర్తి ఎందుకో దిగులుగా వున్నట్టు గుర్తించిన నరహరి ఆరాతీసాడు

అంత చక్కటి వుద్యోగం చేసుకుంటూ, దర్జా జీవితం గడుపుతూన్న ఆ కుర్రాడికి అంత దిగులు ఏమిటో బోధపడక ఆశ్చర్యపోయాడు నరహరి. అదేదో ప్రేమ గాథ కాదుగదా అనిపించింది. ఆ విషయమే అడిగేశాడు అతన్ని.

పరిచయమయినప్పటి నుంచి నరహరిపైన సదభిప్రాయం కలిగింది మూర్తికి. పైగా వయసులో పెద్దవాడు తన మీద శ్రద్ధాసక్తులతో అనునయంగా అడిగేసరికి నిజం దాచాలనిపించలేదు. తన సమస్య ఏమిటో చెబితే అనుభవాలతో తల పండిన ఆ పెద్దాయన ఏదైనా పరిష్కార మార్గాన్ని సూచించకపోతాడా అన్న ఆశ కూడా కలిగింది

అందుకే తనను పీడిస్తున్న సమస్యను ఆయన ముందు పరిచాడు మూర్తి.

అది విని నరహరి పెద్దగా ఆశ్చర్యపోలేదు. కారణం- అటువంటి సమస్యలు ఈ కాలంలో దాదాపు కుర్రకారు అంతటినీ పట్టి పీడిస్తున్నవే!

మూర్తి ఓ అమ్మాయిని ప్రేమించాడు ఆ అమ్మాయి ఓ వున్నత కులానికి చెందినది తాను ఓ వెనుకబడిన జాతికి చెందినవాడు ఆర్థికంగా అన్ని

విధాలా వున్నత స్థాయిలో వున్నాడు తాను. ఆ విషయంలో ఆ అమ్మాయి మాత్రం వెనుకబడే వుంది.

అయినా కులాల అంతరం, తమ అగాధాలను సృష్టించింది. వాటిని అధిగమించాలంటే అసాధ్యంగా కనిపిస్తోంది. కారణం- ఆ అమ్మాయి తండ్రి కూటికి పేదవ డయినా, కులానికి ప్రాముఖ్యత నిచ్చేవాడు. తమ పెళ్ళికి ఒప్పుకోడేమోనన్న భయం.

ఏడాది క్రితం టైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆ అమ్మాయితో పరిచయమయింది మూర్తికి. తొలి చూపులోనే ఒకరి నొకరు ఆకర్షించుకోవడం జరిగింది. ఆ తరువాత తరచు ఏదో చోట కలుసుకుంటూనే వున్నారు వాళ్ళు. ఆ అమ్మాయి అందము, అణుకువ, హద్దుల్లో నడుచుకునే ఆమె తీరూ ఎంతో నచ్చాయి మూర్తికి. పెళ్ళంటూ చేసుకుంటే ఆమెనే చేసుకోవాలన్న నిశ్చయానికి వచ్చేసాడు. తండ్రి అనుమతి లేనిదే తమ వివాహం అసంభవమంటోంది- ఆ అమ్మాయి. కాని, ఆమె తండ్రిని అడిగేదెలా? పిల్లి మెడలో గంట కట్టేది ఎలాగో తెలియక బాధ పడుతోంది ఆ యువ జంట.

మూర్తి చెప్పిన వివరాలు ఆలకించడంతో విస్తుపోయాడు నరహరి.

"చెప్పండి, మాష్టారూ! ఈ ఇరవైయొకటో శతాబ్దంలో కూడా కులమతాల పట్టింపులతో యువ హృదయాలను విడదీయడం సమంజసమంటారా?" అంటూ మూర్తి ఆవేశంతో ప్రశ్నిస్తుంటే- ఏం జవాబు ఇవ్వాలో తోచలేదు నరహరికి.

కారణం- తనకూ అటువంటి పట్టింపులు వున్నాయి. కాని, మూర్తివంటి వరుడు కట్నం లేకుండా లభించినట్లయితే కులం, మతం అంటూ తాను ఆ అవకాశాన్ని వదులుకుంటాడా అన్నది ఆలోచించవలసిన విషయమే!

"ఆ అమ్మాయి వుండేదెక్కడ? ఆమె తండ్రి ఏం చేస్తూ వుంటాడ?" అంటూ ప్రశ్నించాడు నరహరి.

"ఆయన బడి పంతులుగా పని చేసి ఏడాది క్రితమే రిటైరయ్యాడట. వాళ్ళ ఇల్లు దేవాలయిం వీధిలో వుంది" అన్నాడు మూర్తి.

ఉలిక్కిపడ్డాడు నరహరి.

"దేవాలయం వీధిలో... బడి పంతులా!?" తెల్లబోయాడు.

"ఔన్సార్. ఆయన మీకు తెలుసా?" అడిగాడు మూర్తి ఆతృతగా, ఆయన అడిగిన తీరు చూసి.

"ఆ అమ్మాయి పేరేమిటన్నావ్?"

"జయ... తెల్లగా, అందంగా వుంటుంది."

నరహరి గుండె ఓ బీట్‌ని మిస్ చేసింది.

"దేవాలయం వీధిలో వాళ్ళ ఇల్లు ఎక్కడుందో తెలుసా?" ఆతృతను అతి కష్టం మీద అణుచుకుంటూ ప్రశ్నించాడు అతను.

"వీధి చివర బొప్పాయి చెట్టున్న పాత పెంకుటిల్లు..." హఠాత్తుగా గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది నరహరికి.

"అమ్మా!" అంటూ గుండె పట్టుకున్నాడు.

చెబుతున్నది ఆపి నరహరి వంక చూసాడు మూర్తి.

"మాష్టారూ!" అన్నాడు కంగారుగా.

గుండె పైన చేత్తో రాచుకుంటూ వెనక్కి జారబడిపోయాడు నరహరి.

"ఏమయింది, మాష్టారూ? ఇంత హఠాత్తుగా ఎందుకలా అయిపోయారు? గుండె నొప్పా?" అంటూ ఆతృతతో ప్రశ్నల వర్షం కురిపించాడు మూర్తి.

"ఎందుకో గుండెల్లో సన్నగా పోటు మొదలయింది బాబూ! ఇవాళ్టికి ఇంటికి వెళ్ళిపోతాను" అంటూ లేచాడు నరహరి.

"నన్ను కూడా రమ్మంటారా?" అడిగాడు మూర్తి.

"ఒద్దొద్దు." అన్నాడు నరహరి కంగారుగా. "ఇంటికి వెళ్ళి పడుకుంటే అదే సర్దుకుంటుంది."

అతను వారిస్తున్నా వినకుండా రిక్షాను పిలిచి ఎక్కించాడు మూర్తి. రిక్షా వాడికి డబ్బులు తానే ఇచ్చేసాడు.

ఆ రాత్రి ఇంటికి నరహరి వచ్చాడేగాని మనసు మనసులో లేదు. గుండెలో పోటు సర్దుకున్నా, మనసు మాత్రం సర్దుకోలేకపోతోంది. ఆలకించిన కొత్త విషయాన్ని ఆకళింపు చేసుకోలేకపోతోంది.



## ఆడపిల్ల తండ్రి

"అదోలా వున్నారేమిటి? వొంట్లో బావుండలేదా?" అని భార్య పరామర్శించితే, "ఏం లేదు" అన్నాడు ముక్తసరిగా.

మూర్తి పలుకులే అతని మదిలో మెదలుతున్నాయి

'ఆ అమ్మాయి పేరు జయ . తెల్లగా, అందంగా వుంటుంది. దేవాలయం వీధిలో చివర.. బొప్పాయి చెట్టున్న.. పాత పెంకుటిల్లు-వాళ్లది... ఆమె తండ్రి రిటైర్డైన బడి పంతులు .'

ఇంటిలో తిరుగుతూన్న కూతురు వంక దొంగ చూపులు చూసాడు నరహరి.

ఆ చూపులు కొత్తగా వున్నాయి.

జయంతి ..!

అమాయకంగా కనిపించే తన కూతురు...

తనకు తెలియకుండానే ప్రేమలో పడిందా!?

రోజూ ఎవరో స్నేహితురాలింటికి వెళ్తొస్తున్నానంటే నిజమే కాబోలు అనుకుంటున్నాడు తను. ఆవంకతో రోజూ మూర్తిని ఎక్కడో కలుసుకుంటోదన్న విషయం తనకేం తెలుసు!?

ఏమి ఎరుగని దానిలా ఎంత అమాయకంగా కనిపిస్తోంది!

తన ప్రేమకు తాను అడ్డుగా వున్నాడని జయంతి బాధ పడుతోందా?

తన భవిష్యత్తుకు భూతంలా అడ్డు నిలుస్తున్నాడనుకుంటోందా?

తన ప్రేమను ఇటు నాతో చెప్పుకోలేకా, అటు వదులుకోనూ లేకా తనలో తానే సతమతమవుతోందా?

హఠాత్తుగా అనిపించింది నరహరికి-కొన్నాళ్ళుగా జయంతిలో ఏదో మార్పు వచ్చిందని. ఎప్పుడూ హుషారుగా, చలాకీగా వుండే పిల్ల- ఆ మధ్య మౌనంగా, గంభీరంగా వుంటున్నట్లు అనిపించింది.

"భోజనానికి లే, నాన్నా!" అని కూతురు పిలవడంతో గాఢంగానిట్టూర్చి లేచాడు నరహరి.

ఆ తరువాత దాదాపు ప్రతి రోజూ నరహరి, మూర్తి పార్కులో కలుసుకుంటూనే వున్నారు.

తన ప్రేమను గూర్చి కొత్త కొత్త విశేషాలను ఎప్పటికప్పుడు నరహరి చెవిన వేస్తూనే వున్నాడు మూర్తి.

'తాను ప్రేమిస్తున్నది నా కూతుర్నేనన్న విషయం ఎరుగడు పాపం!' అనుకున్నాడు నరహరి మనసులో

ఇప్పుడు నరహరి పని ద్వైదీయంలో పడింది .. కూతురికి కులాంతరపు వివాహం చేసినట్లయితే సాటి కులపు వాళ్ళు వెలి వేస్తారేమోనన్న భయం ఒక వంక... మరో వంక- కూతురి భవిష్యత్తుకు ప్రతిబంధకం కావడం ఇష్టం లేదు . మానసికంగా సతమతమవుతున్నాడు నరహరి.

జయంతి వయసుకూ. అందానికి. తెలివి తేటలకు తగిన వరుణ్ణి, సాటి కులపోణ్ణి తేలేడు తాను. కులపు కోతిని తేవాలన్న కష్టం కావాలి!

జయంతిని ఏ అనామకుడికో ఇచ్చి కట్టబెట్టనూ లేడు. మనస్ఫూర్తిగా ప్రేమించుతూన్న మూర్తికి ఇచ్చి వివాహం జరిపించడంకంటే మంచి పనిని తన జన్మలో చేయలేడు. ఆ జన్మలో అంతటి మంచి సంబంధాన్ని తీసుకురాగలనిని కలలో కూడా ఆశించలేడు కులాన్ని నమ్ముకున్నందువలన తనకు వొరిగేదేమి లేదు. అలాగని కూతురిని కులాంతరపు వివాహం చేసే తెగింపూ లేదు తనకు.

అతని హృదయాంతరాలలో జయంతి, మూర్తిని చేసుకోవడం అతనికి ఇష్టమే. కాకుంటే, ఆ విషయాన్ని బహిరంగంగా వొప్పుకోలేడంతే! అందుకే లోలోపల, వారి ప్రేమ సఫలం కావాలని, తనకు తెలియకుండానే వాంఛిస్తున్నాడు, ఆశీర్వదిస్తున్నాడు... అందుకే మూర్తిని డిస్కరేజ్ చేయలేదు అతను. కూతుర్ని మందలించనూలేదు

ఎప్పటికప్పుడు వారి ప్రేమ ఎంత వరకు వచ్చినది ఆత్రుతతో తెలుసుకుంటూనే వున్నాడు.




అతని ఆరాటం చూచాయగా గమనించిన మూర్తి ఒసారి, "జయ కుటుంబం మీకు తెలుసా, మాస్టారూ?" అని అడిగాడు

నరహరి తతబడి, "తెలిసినట్లే వుంది" అని తప్పించుకున్నాడు

మరో రోజున, "ఇలా ఎన్నాళ్లని బాధ పడేది, మాస్టారూ! మా ఇంట్లో నా పెళ్ళికి తొందర చేస్తున్నారు జయను తప్ప ఇంకెవరినీ పెళ్లాడదలచుకోలేదు నేను. జయ తండ్రికి చెప్పి వొప్పించే ధైర్యం మా ఇద్దరికీ ఎలాగూ లేదు... ఇద్దరమూ ఎక్కడికైనా వెళ్ళిపోయి గుళ్లో పెళ్లి చేసుకోవాలనిపిస్తోంది నాకు. అందుకు జయ వొప్పుకోవడం లేదు. తండ్రికి తల వొంపులు తెచ్చే పని తాను చేయనంటోంది.. ఇక ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో తోచడం లేదు, మాష్టారూ!" అంటూ వాపోయాడు మూర్తి

అది వింటూనే కూతురి విజ్ఞతకు లోలోపలే అభినందించాడు నరహరి. 'ఎంతైనా నా కూతురు!' అనుకున్నాడు గర్వంగా

"అమ్మాయి చెప్పింది సబబుగానే అనిపిస్తోంది మరి," అనడం మినహా ఇంకేమి అనలేకపోయాడు.

"మాష్టారూ! జయ తండ్రి మీకు తెలుసేమోనని పిస్తోంది నాకు. దయ చేసి ఆయన మా పెళ్ళికి అంగికరించేలా చేయలేరూ? ప్లీజ్!" అన్నాడు మూర్తి నరహరి చేతులుపట్టుకుని.

"ఆయనతో నాకు పెద్దగా పరిచయం లేదు. అయినా ప్రయత్నిస్తాలే" అనగలిగాడంతే నరహరి, నిజం చెప్పడానికి ధైర్యం చాలక.

'తన మేకపోతు గాంభీర్యం చూసి భయపడు తున్నారు వాళ్ళు. వాళ్ళు ధైర్యం చేస్తే తాను. కాదనలేదన్న సంగతి వాళ్లకెలా తెలుస్తుంది!' అనుకున్నాడు మనసులో

అది జరిగి వారం రోజులయింది.

ఆ తరువాత ఏ కారణం చేతనో మూర్తి మళ్ళీ కనిపించలేదు నరహరికి. ఎంచేతో పార్కుకి రావడం లేదు అతను. ఏధైనా పని మీద ఏ వూరికైనా వెళ్లాడో, లేక జబ్బు పడి మంచం ఎక్కాడో తెలియక కొద్దిగా కలవరపడ్డాడు. ఇంట్లో కూతుర్ని జాగ్రత్తగా గమనించసాగాడు. ఏ మాత్రం అనుమానాస్పదంగా లేదు ఆమె ప్రవర్తన. 'ఎంతయినా జయంతి తెలివయినది. అంత సులభంగా బయటపడదు' అనుకున్నాడు.

ఎప్పటిలాగే ఆ వారం రోజుల్లోనూ స్నేహితురాలి ఇంటికని జయంతి వెళ్ళి వస్తూనే వుంది. కనుక మూర్తి వూర్లోనే వుంది వుండాలి అనుకున్నాడు నరహరి. అయితే అతను పార్కుకు ఎందుకు రావడం లేదో బోధపడలేదు. .. 'కొంప దిసి తానెవరో ఆ కుర్రాడికి తెలిసిపోలేదుగదా!' అనిపించింది.

ఆ మధ్య నరహరిలో అంతర్మథనం అధిక మయింది. కూతురి సుఖం కోసం తన పరువు ప్రతిష్టలకు తిలోదకాలు వదులుకుందామా అనిపించసాగింది... మూర్తి పిల్లను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాడు. అతన్ని చేసుకున్నట్లయితే




అన్న ఆశయం అవశ్యం. ఆచరణీయం. అయితే భూమాతను – "తల్లీ! నేను విత్తిన గింజకు పది గింజలు పంటగా ప్రసాదించి నా ఇంట సిరులొలికించు" – అని అడగాలి.
అదనులో పదనుగా దున్నాలి.
మేలైన విత్తనాలను నాటాలి. సరిపడ నీరు పెట్టాలి.
ఆపైన మరింత నత్రజనిని అందించే
"స్వస్తిక్ బ్రాండ్ రామగుండం యూరియా"
ఎరువును వేయాలి.

అధిక దిగుబడి వచ్చి, రైతు కలలు నిజం అవ్వాలంటే స్వస్తిక్ బ్రాండ్ రామగుండం యూరియా వాడండి.
మట్టిని మాణిక్యంగా మార్చేది పుట్ట కొలది పంటనిచ్చేది
యూరియా ఎరువులలో తల మానికం
"రామగుండం స్వస్తిక్ బ్రాండు యూరియా."

**శుభ, సౌభాగ్యాలకు చిహ్నం.**
**స్వస్తిక్ బ్రాండ్ రామగుండం యూరియా.**



**ది ఫర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లి.**
(కేంద్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ)
మార్కెటింగ్ డివిజన్, హైదరాబాద్ - 500 004

Sobhagya H/FCI/86/1

జీవితాంతమూ సుఖపడుతుంది. కట్నాలు ఇవ్వ గలిగే స్థితిలో లేడు తాను. ఎంత కట్నం పోసినా మూర్తి వంటి సంబంధం తేవడమూ అసాధ్యమే.... ఇలా సాగిపోతున్నాయి అతని ఆలోచనలు. అలాగని బహిరంగంగా గ్రీన్ సిగ్నల్ ఇవ్వడానికి ధైర్యం చాలడం లేదు.

మూర్తి కోసం ఎదురు చూస్తూంటే ఆ మధ్య అవే ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి అతని మదిలో.

ఆ వ్యవహారాన్ని గూర్చి జయంతిని అడిగివేద్దామా అనిపించేది ఒక్కోసారి. బలవంతంపైన ఆ ఆలోచనకు స్వస్తి చెప్పే వాడు.

తానొక ఆడపిల్ల తండ్రి. కట్నం లేకుండా తన కూతుర్ని పెళ్ళి చేసుకుంటాననీ, పువ్వుల్లో పెట్టి చూసుకుంటాననీ, అన్ని విధాలా అర్హుడైన ఓ యువకుడు ముందుకు వస్తే- కాదనడం అవివేకమే అవుతుంది. కుల మతాలు తన కూతురి జీవితాన్ని బంగారుమయం చేయలేవు. తనకూ మంచి చెయ్య లేవు. కనుక ఆ అవకాశాన్ని వినియోగించుకోవడం ఉత్తమం. కాలదన్నుకోవడం మూర్ఖత్వం అవుతుంది.

ఇద్దరిలో ఎవరు కదిపినా 'ఓ.కే.' అనేద్దామని చూస్తున్నాడు అతను. తనంతట తానుగా చెప్ప డానికి మనస్కరించడం లేదు. భేషజం అడ్డు వస్తోంది.

ఆ రోజు కూడా బాగా ప్రొద్దెక్కేంత వరకూ మూర్తి కోసం ఎదురు చూసి, నిరాశతో ఇంటి ముఖం పట్టాడు నరహరి

అయితే, పార్కు గేటు దగ్గరకు వచ్చేసరికి హడావుడిగా వస్తూ ఎదురుపడ్డాడు మూర్తి.

"మాష్టారూ!" అంటూ పిలిచాడు.

అతను ఎందుకో హుషారుగా కనిపించాడు.

అతన్ని చూడడంతో పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది నరహరికి

"ఇన్ని రోజులుగా కనిపించకపోతే మనసు పరి పరి విధాలుగా పోయింది. ఏమయింది బాబూ!" అంటూ పలుకరించాడు ఆప్యాయంగా.

"రండి మాష్టారూ! ఓ పది నిముషాలు కూర్చుని వెళ్ళిపోదాం" అంటూ పార్కు లోపలికి దారి తీసాడు మూర్తి. "ఈ శుభ వార్త చెవిని వేయాలనే వచ్చాను "

గుండె గతుక్కుమంది నరహరికి. 'కొంపదీసి వేరే ఏ పిల్లతోనయినా ఇతని పెళ్ళి కుదరలేదు గదా! విసుగెత్తి పెద్దల వొత్తిడికి లొంగిపోయాడేమో. పెద్దలు చూసిన పిల్లను పెళ్ళాడుతున్నాడేమో! ఏ పూర్వనో పెళ్ళి చూపులకువెళ్ళడం మూలానే ఇన్నాళ్ళూ రాలేదేమో!' అనుకున్నాడు.

మూర్తి చెప్పబోయే దాని కోసం అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"మాష్టారూ! ఈ వారం రోజులూ నేను కనిపించక పోవడానికి కారణం ఏమిటో తెలుసా? మా హెడ్డాఫీసుకి వెళ్లాను. బదిలీ కోసం ప్రయత్నించేందుకు..."

## అక్షరసాగర మథనం

పుంఖాను పుంఖాలుగా
రాసేస్తున్నారు
అక్షరాల సాగరాన్ని
మథనం చేస్తూ -
ఒక వయిపు
కవితాసురులూ
ఇంకొక వయిపు
నవ్య కవిశూరులు-
ఒక వయిపు
క్షుద్ర కవి పుంగవులు
ఇంకొక వయిపు
చేతబడుల సాహితీవేత్తలు
అక్షరాల సాగరమథనం చేస్తూ -
ఈ మథనంలో
అశ్రు కవితలు
ఆశుకవితలు
అపహాస్య కవితలు
అసభ్యపు రాతలు
పుట్టుకొస్తున్నాయ్-
అక్షర మథనం జరుగుతే
అభ్యుదయ కవిత్వం
ఆచరణ సాహిత్యం
అణగువారి ఆక్రందనల
ఆవేశాల అక్షర రూపం
పుట్టాలి-
అందరూ రసాస్వాదనం
చేయాలి
లేకుంటే
ఆశయం 'పూజ్యం'
ఇతివృత్తం 'పెద్ద వృత్తం'-

—అస్రాని

## ఆడపిల్ల తండ్రి

"బదిలీయా! ఎందుకూ?" అన్నాడు నరహరి నీరసంగా.

"ఎలాగైతేనేం జయను వొప్పించగలిగాను, మాష్టారూ! నాతో వచ్చేయడానికి అంగీకరించింది. అయితే వున్న వూళ్లోనే వుండడం ఇష్టం లేక మా హెడ్డాఫీసుకి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను..." ఉత్సాహంగా చెప్పుకుపోయాడు మూర్తి. "మాష్టారూ! జయా, నేనూ రేపు రాత్రికే వెళ్ళి పోవడానికి నిశ్చయించుకున్నాము. తిన్నగా తిరుపతి వెళ్ళి ఏడుకొండలవాడి ముందు పెళ్లాడుతాము. అటు నుంచి అటే కొత్త వూరికి వెళ్ళి డ్యూటీలో జాయినయిపోతాను..."

"అలాగా!" అన్నాడు నరహరి సంభ్రమంతో. ఎదురు చూడని ఆ వార్త హఠాత్తుగా ఆలకించ డంతో అతనిలో మిశ్రమ భావాలు చోటు చేసుకున్నాయి.

"మాష్టారూ! తరువాత విషయం నెమ్మది మీద జయ తండ్రికి తెలియపరుస్తాము. ఆయన వొప్పుకున్నట్లయితే తిరిగి వచ్చి ఆయన ఆశీర్వాదం పొందుతాము" అన్నాడు మూర్తి "మొదటి నుంచి నా మీద అభిమానం చూపుతున్న మీకు ఈ శుభవార్త చెవిన వేస్తే సంతోషించి, మమ్మల్ని ఆశీర్వదిస్తారని వచ్చాను."

"శుభం! ఆ ఏడుకొండల వాడు మీకు అండ దండలుగా వుంటాడు, బాబూ!" అంటూ మన స్పూర్తిగా ఆశీర్వదించాడు నరహరి.

జయంతికి తగిన వరుడు లభిస్తున్నందుకూ, కోరుకున్న వాడితో మనువు జరుగబోతున్నందుకూ ఎంతో సంతోషంగా వున్నది అతనికి.

కాని, మనసులో ఏమూలో కలుక్కుమనక పోలేదు. తన కన్న కూతురు తనకు చెప్పకుండానే ప్రియుడితో లేచిపోతోంటే, నలుగురూ నాలుగు విధాలుగా ఆడిపోసుకుంటారే అన్న బాధ కలిగింది. లోకుల ఎత్తిపొడుపుల్ని తాను భరించ గలడా అన్న బెంగ కూడా కలిగింది.

నలుగురిలా స్వగృహంలో పందిట్లో పెళ్ళి చేసుకునేందుకు నోచుకోలేక పోయిందే, కూతురి పెళ్ళి తన చేతుల మీదుగా చేయలేక పోతున్నానే అన్న అసంతృప్తి కూడా మదిలో దొలుస్తోంది.

అంతలోనే, "కులపువాళ్లను కాదని తన చేతులు మీదుగా ఆ పెళ్ళి చేయగల సాహసం తనకు వున్నదా? వాళ్ళు అలా పరాయిచోట పెళ్ళి చేసుకుని రావడమే మంచిది ప్రస్తుతానికి. ఆ తరువాత అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి" అని తనకు తానే ధైర్యం చెప్పుకున్నాడు.

ఆ రాత్రంతా అన్యమనస్కంగానే వున్నాడు నరహరి. కూతురిని చాటుగా పట్టి పట్టి చూడ సాగాడు. మామూలుగానే కనిపించింది జయంతి. ఆ పిల్ల వదనంలో ఎటువంటి భావాలూ కనిపించ లేదు.

మూర్తి తన ప్రియురాలితో లేచిపోయే రోజున—

"క్షమించు తల్లీ! ఈ దేశంలోని ఓ ఆడపిల్ల తండ్రిని నేను! నీ సుఖం కోరి నిన్ను వొంటరిగా వెళ్ల నిస్తున్నాను. మూర్తి బుద్ధిమంతుడు. నిన్ను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాడు అతని జతలో నీ జీవితం సౌఖ్యవంత మవుతుందన్న విశ్వాసం నాకుంది. అందుకే నిన్ను వెళ్ల నిస్తున్నాను...." అనుకున్నాడు నరహరి మనసులో, కూతురి వంక మౌనంగా చూస్తూ.

ఆ రోజంతా జయంతి మామూలుగానే వుంది. అతను ఎంత వెదికినా ఎటువంటి తొట్రుపాటూ కనిపించ లేదు ఆమెలో.

కని, పెంచిన తల్లినీ, తండ్రినీ హఠాత్తుగా విడిచిపెట్టి చెప్పకుండా వెళ్ళిపోవలసి వస్తున్నందుకు ఆమె అమితంగా బాధపడు తుందన్న ఆలోచనతో రహస్యంగా ఆమెను గమనిస్తున్న నరహరికి ఆశాభంగమే అయింది. ఆ

పిల్ల మనసులో ఏమి వున్నదో ఏమో, ముఖంలో మాత్రం అటువంటి ఛాయలేవీ గోచరించ లేదు. మామూలుగానే కనిపించింది. ఓ క్షణం చివుక్కుమంది అతని మనసు. అంతలోనే, "పిల్ల గుట్టయినది. తన బాధను లోలోపలే దాచుకుంటుందే తప్ప పైకి తేలదు. పిల్లకు బాధ లేదనుకోవడం పొరపాటు!" అని తన మనసుకు సర్ది చెప్పుకున్నాడు.

ఆ రాత్రి పెందలకడనే భోజనం చేసి త్వరగా పడక ఎక్కాడు నరహరి. అంతేకాదు, నిద్ర పట్టడం లేదంటూ కూతుర్ని అడిగి ఓ నిద్రమాత్ర కూడా వేసుకున్నాడు. ఆ విధంగా రాత్రి ఆమె ఇంటి నుంచి వెళ్ళడానికి తన అడ్డు వుండదన్నట్టు కూతురికి పరోక్షంగా సూచించడమే అతని వుద్దేశ్యం. పడుకునే ముందు తనివిదీరా కూతుర్ని ఓసారి ఆప్యాయానురాగాలతో చూసుకున్నాడు. తెల్లవారితే మరి కనిపించదు ఆమె! మళ్ళీ ఎప్పటికో చూసుకునేది!

ఉదయం నిద్ర లేచేసరికి కూతురు కనిపించక తన భార్య చేయబోయే రాద్ధాంతాన్ని తలచుకుంటూ కన్ను మూసాడు అతను.

* * * *

రాత్రి నిద్రమాత్ర వేసుకున్నాడేమో, మరునాడు నరహరి నిద్రలేచేసరికి ప్రొద్దెక్కింది.

నిద్ర మంచం మీదనే, "ఏమండోయ్, ఈ చోద్యం ఆలకించారా?" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ వచ్చింది నరహరి భార్య.

అప్పుడు గాని గుర్తుకు రాలేదు అతనికి కూతురు ఆ రాత్రి వెళ్ళిపోయి వుండాలన్న సంగతి.

"ఏమిటే?" అన్నాడు వినబోయే వార్త కోసం గుండెలు బిగబట్టుకుని.

"ఆ శంకరయ్యగారు లేరూ?...." అంటూన్న భార్యతో, "ఏ శంకరయ్యో?" అన్నాడు, ఏదో చెప్పబోయి ఇంకేదో సోది చెబుతోందన్న విసుగుతో.

"అదేనండి. ఈ వీధికి పశ్చిమపు చివర పెంకుటిల్లు. రిటైర్డ్ హెడ్‌మాస్టర్ శంకరయ్యగారు...." అందామె.

"ఏమయిందే ఆయనకు?"

"ఇంకా అయే దేముందండి? అతని పరువు పోతేనూ....!"

"ఆఁ!?"

"ఆయన కూతురు రాత్రి ఎవడితోనో.... కులం కాని వాడితో లేచి పోయిందట.... అవ్వ!" అందామె.

అదిరి పడ్డాడు నరహరి.

"ఏమిటే నువ్వంటున్నది? ఆ అమ్మాయి పేరేమిటి?" కంగారుగా అడిగాడు, నిద్రమత్తు పూర్తిగా వదిలి పోవడంతో.

"ఆ పిల్ల పేరు జయలక్ష్మి. ఎవణ్నో ప్రేమించాను వాణ్నే పెళ్ళి చేసుకోవడానికి వెళ్ళి పోతున్నాను.. అని ఓ వుత్తరం రాసి పెట్టి వెళ్ళి పోయిందట!...."

భార్య పలుకులతో అతని తల దిమ్మెక్కి పోయింది. "మన జయంతి ఎక్కడ?" అన్నాడు అయోమయంగా.

"నేను జయలక్ష్మి సంగతి చెబుతుంటే, మీరు జయంతి ఎక్కడ అంటా రేమిటండీ? అది ఇంట్లోనే వుంది" అంది భార్య మూతి ముడుచుకుంటూ.

"జయంతి ఇంట్లోనే వుందా!?" అన్నాడు అతను అపనమ్మకంగా.

"పిలిచావా, నాన్నా?" అంటూ అక్కడికి వచ్చింది జయంతి.

కూతుర్ని చూడటంతో తెల్లబోయాడు నరహరి. అంతా అయోమయంగా వున్నది అతనికి.

"ఆ పిల్ల పోకళ్ళు చూసి అప్పుడే అనుకున్నానులెండి, అదెప్పుడో ఇలాంటి అప్రతిష్టపు పని చేస్తుందని!" అంటోంది భార్య.

"మన జయంతి బంగారం!" అంటూ కూతుర్ని దగ్గరకు తీసుకుని అనురాగంతో తల నిమిరిందామె.

కాని, ఆమె పలుకులు గాని, చేష్టలు గాని నరహరి తలకు ఎక్కడం లేదు.

పొరపాటు ఎక్కడ జరిగిందా అని ఆలోచిస్తుంటే, అసలు విషయం ఆకళింపుకు వచ్చింది అతనికి. తాను ఎంత ఘోరంగా పరాభవం చెందాడో తెలిసి వచ్చింది.

దేవాలయం వీధిలో.... వీధి చివర.... బొప్పాయి చెట్టున్న.... పాడుపడిన పెంకుటిల్లు......

మూర్తి చెప్పింది నిజమే. తానే పొరబడ్డాడు.

వీధిలో ఏ చివర అని తాను అడగలేదు. అడిగితే అతను చెప్పేవాడేమో– పడమటనని!

అది శంకరయ్య గారి ఇల్లు. ఆయనా రిటైర్డ్ బడిపంతులే!

అయితే–

అతను హెడ్‌మాస్టరుగా రిటైరయితే, తాను ఎలిమెంటరి స్కూలు టీచరుగానే రిటైర్ అయ్యాడు.

శంకరయ్య గారిది, తనది వీధి చివరి ఇళ్ళే!

ఆయన ఇల్లు వీధికి పశ్చిమ కొసను వుంటే– తనది తూర్పు దిక్కున చివరి ఇల్లు!

ఇద్దరి ఇళ్ళలోనూ బొప్పాయి చెట్లు వున్నాయి.

ఇద్దరి ఇళ్ళూ ఇంచుమించు ఒకే దశలో వున్నాయి.

అలాగే– శంకరయ్య గారి అమ్మాయి పేరు జయలక్ష్మి.

ఆ విషయం తనకు తెలియదు. మూర్తి "జయ" అంటే జయంతిని అలా పిలుస్తున్నా డనుకుని పొరబడ్డాడు తాను.

శంకరయ్య గారు నిప్పును నీటితో కడిగే నిక్కచ్చి మనిషి. కులం కోసం ప్రాణాలు వదులుతాడు ఆయన.

ఆయన విషయం ఎందుకు గుర్తుకు రాలేదు తనకు?!

మూర్తి చెబుతూన్న వివరాలను తనకు ఆపాదించుకుని ఎలా మోసపోయాడు?!

తన ఆలోచనలు, ఆశలు తలక్రిందులు కావడంతో తట్టుకోలేక పోయాడు నరహరి. హఠాత్తుగా జబ్బు చేసిన వాడిలా అయిపోయాడు.

"వ్రతం చెడినా ఫలం దక్కలే దన్నట్టు...." అయింది అతని పరిస్థితి.

ఓ ఆడపిల్ల తండ్రిలా.... ఓ సగటు మానవుడిలా.... కూతురికి కట్నం ఇచ్చి పెళ్ళి చేయలేక.... ఆ పిల్ల ప్రేమలో పడితే చాలనుకుని.... మనసుకు నచ్చిన వాడితో ఆమె లేచిపోయినా ఫరవా లేదనుకుని.... కుల గోత్రాలను సయితం పట్టించుకోకుండా.... మనసుతో, పరిస్థితులతో రాజీ పడినందుకు.... ఘోర పరాజయాన్ని పొందాడు నరహరి.

---

చేష్టలు వుడిగి కూతురి వంక అయోమయంగా, వెర్రిగా చూస్తూ వుండిపోయాడు.

అంతరాంతరాలలో అతనింకా మూర్తిని అభినందిస్తున్నాడో....' అసూయతో శపిస్తున్నాడో.... అతనికే తెలియాలి మరి! □



## మత్తు పదార్థాల దొంగ రవాణా!

తిరుచ్చి విమానాశ్రయం నుంచి బయలు దేరే విమానంలో సిలోన్ వెళ్ళే ప్రయాణీకులలో 25 ఏళ్ళ అహమ్మద్ అనే వ్యక్తి చూపులు సరిగా లేనందున అతన్ని ప్రత్యేకంగా తనిఖీ చేస్తే లక్ష రూపాయల కిమ్మత్తు మత్తు పదార్థాలు గమ్మత్తుగా దాచే దటాతడు.

## భర్త తిట్లు – భార్య ఆత్మహత్య!

శివకాశికి చెందిన గురువమ్మ అనే ఆమె తన 5 ఏళ్ళ కొడుకు గురుసామిని కోపం వచ్చి చితక బాదిందట. అది చూసిన ఆమె భర్త రాజేంద్రన్ ఆమెను నానా తిట్లూ తిట్టి పిల్లాడిని తీసుకు పోయి స్కూల్లో వప్పజెప్పి తిరిగి వచ్చే లోగా ఆమె తన భర్త తిట్టినందుకు అభిమానపడి, అదే విషయం వో వుత్తరంలో వ్రాసి, మీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకు చనిపోయిందట. ప్రభుత్వాసుపత్రిలో మరణ వాఙ్మూలంతో కూడా అదే విషయం చెప్పిందట.

## కళ్ళు చూసి రోగ నిర్ణయం!

సమస్తమైన రోగాలలో చాలా హెచ్చు భాగం రోగాలు కళ్ళల్లో ప్రతిఫలిస్తాయని, కళ్ళు చూసి, శరీర స్థితిని, ఆరోగ్య స్థితినీ చాలా సునాయాసంగా చెప్పవచ్చుననీ, అలసట, నిద్రలేమి, మానశిక క్షోభ, అజీర్ణం, జ్వరం, నిస్సత్తువ, రక్త సుదత వంటివన్నీ కళ్ళను చూసి చెప్పవచ్చునని రష్యాకు చెందిన డాక్టర్ లాడిమిర్ ఫిలతోవ్ ఏనాడో అన్నారట.

## ఫ్రాన్సులో ప్రజల వద్ద ఆయుధాలు!

ఫ్రాన్సులో సుమారు 300 లక్షల రకరకాల పిస్టళ్ళు, తుపాకులు, రైఫిల్స్, గన్స్ వంటి ఆయుధాలు ప్రజల వద్ద యథేచ్ఛగా వున్నట్టు, దీనివలనా, మత్తు పదార్థాలు సేవించడం వలనా అక్కడ నేరాలు ఎక్కువవుతున్నట్టూ రష్యా పత్రిక వెల్లడించింది.

## వింత పద్ధతిలో కాన్పు!

చైనాలో వో గర్భిణీ స్త్రీని ప్రసవ ఆసుపత్రికి తెస్తే అక్కడి డాక్టరు జార్జ్ థారన్‌గేట్ ఆమెకు మామూలు కాన్పు రాదనీ, ఆపరేషను చేయాలనీ చెప్తే ఆమెతో వచ్చిన వారు అదేం వొద్దు అని ఆ స్త్రీని తీసుకు పోయారట. ఇంట్లో వొకామె కాళ్ళను, వొయిద్దరు చేతులనూ పట్టుకుని ఆ గర్భిణీ స్త్రీని పడుకున్న పోజులో గాలిలోకి ఎత్తి విసవిస బట్ట దులిపినట్టు వూపారట. దాంతో ఆమెకు కాన్పు అయిపోయిందట– పోయిందనికాదు– అయ్యిందట.

## కొత్త నాగరికత!

ఆలో కోవా (పాల్ కోవాకాదు) అనే నగరంలో ఒక కంపెనీ వుద్యోగం కోసం సుమారు 750 మందిని యింటర్వ్యూకు పిలిచి వారి మూత్రం పరీక్షిస్తే వచ్చిన 750 మంది కూడా నిషాపదార్థాలు వాడేవారేనని తేలిందట. చక్కని వుషారైన వుద్యోగం కోసం దరఖాస్తులు పెట్టిన అందరూ మత్తు పదార్థాలు సేవించే వారవడం మా దురదృష్టం అన్నాడటాకంపెనీ డైరెక్టరు. త్రాగుడే గాక, మత్తు పదార్థాలు సేవించడం జీవితంలో వో కొత్త నాగరికతగా మారి పోయిందని కూడా ఆయన వాపోయాడట– పోనీ! □

MAM-28

ఆ రైలుకట్టని చూసి మీరేం కంగారు పడకండి!
ఈ ఇంటిని పునాదులనుంచి పూర్తిగా
నాగార్జున సిమెంటుతోనే కట్టించాం!
భూకంపం వచ్చినా తొణకదు బెణకదు!




సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

"నాని" ఒకటే ఏడుస్తున్నాడు.

సీత ఎంత ఎత్తుకుని లాలించినా లాభం లేకపోతూంది.

వాడ్ని వూరడించటం అసాధ్యం అయిపోతూంది.

ఎందుకో తెలియదు.... ఈ మధ్య అప్పుడప్పుడు అలాగే పోరు పెడుతున్నాడు.

పైగా నానికి నాల్గు రోజులుగ బాగా జలుబు చేసింది.

స్నానం చేయిస్తున్నప్పుడు నీళ్ళు మింగాడు. దాంతో పడిశం పట్టి బాగా ముస ముస లాడుతున్నాడు.

పసుపు పొడి పొగ పట్టి, శొంఠి గంథం రాసి సుబ్బులు దానికి తోచిన విధంగా వైద్యం చేస్తూనే వుంది

పొట్టకి ఆముదం రాసి కాపు కూడా పెట్టింది.

సీత నానికి గ్రైప్‌వాటర్ తాగించింది.

విక్స్ రాసింది. అయినా వాడి ఏడుపు మాత్రం తగ్గటం లేదు.

నిన్నట్నుంచి వుండి వుండి అలాగే ఏదో తీరని బాధ వున్నవాడిలా కెవ్వు.... కెవ్వన ... ఏడుస్తున్నాడు.

ఆ ఏడుపు ఈ రోజు మరి ఎక్కువ అయిపోయింది.

పాలు కూడా సరిగా తాగలేదు

తాగిన కాసిన్ని ఆ ఏడుపు వల్ల కక్కుకున్నాడు.

సీతకి ఎటూ తోచటం లేదు.

ఏమి తెలియటం లేదు

కాని కొడుకు ఏడుపు వింటుంటే ఆమె మనసు పిండి మరలో పడ్డ వడ్ల గింజలా తన్నుకుంటోంది.

మరొక ప్రక్క ప్రభాకర్ పిల్లల్ని వెంట పెట్టుకుని బావమరిది పెళ్ళికి ప్రయాణం అవుతున్నాడు.

పైగా గత నాల్గు రోజుల నుండి "రంగా" పనిలోకి రావటం లేదు. వాడికి

దాంతో ప్రభాకర్ అవసరాలు చూడవల్సిన బాధ్యత కూడా సీత మీదే పడింది.

తెల్లారితే పెళ్ళి!

ప్రభాకర్ పిల్లలతో ప్రయాణ హడావుడిలో వున్నాడు.

టిక్కట్లు రిజర్వు చేసుకున్నారు.

సీత పిల్లలిద్దరికి దగ్గరుండి అన్నం తినిపించింది.

సూట్ కేసులో బట్టలు సర్ది ముస్తాబు చేసింది.

ముందు హరిబాబుని తీసుకు వెళ్ళొద్దు అనుకున్నాడు ప్రభాకర్.

కాని అత్తగారూ మామగారూ మరి మరి చెప్పటంతో వాడ్ని కూడా వెంట తీసుకుని వెడుతున్నాడు.

హరికి వాళ్ళ అమ్మమ్మ దగ్గర, పిన్నిల దగ్గర బాగానే అలవాటు.

అందుకే ప్రభాకర్ ధైర్యం చేసి వాడ్ని కూడా తీసుకు వెడుతున్నాడు.

పెళ్ళయిన మర్నాడు వచ్చేస్తారు.

సీత వాళ్ళకి కావల్సిన ప్రయాణం ఏర్పాట్లన్ని చూస్తోంది.

బట్టలు, సామాను.... అన్ని సర్దుతోంది.

మధ్య మధ్య ప్రభాకర్ పిలుస్తుంటే అతని గదికి వెళ్ళి కావల్సినవి చూస్తోంది.

కాని వంట గది వైపు వచ్చినపుడు మాత్రం "నాని" ఏడుపు గొంతు ఆ తల్లి హృదయాన్ని కలవర పెడుతూంది.

మాతృ మమకారంతో ఒడ్డున పడ్డ చేపలా ఆమె హృదయం గిజగిజ మంటోంది.

చేతిలో పని ఒదిలి గభాల్న వెళ్ళి వాడ్ని ఎత్తుకుని హృదయానికి హత్తుకోవాలని పిస్తోంది.

కాని అంతలోనే మనసు నిగ్రహించుకొంటూంది. సుబ్బులు ఎత్తుకుంది కదా అని సమాధానపడుతూంది. ఇంకొక్క గంట ఓపిక పడితే ప్రభాకర్, పిల్లలు వెళ్ళిపోతారు.

ఆ తరువాత మూడు రోజుల దాకా అంతా తీరికే!

తను కొడుకు నెత్తుకుని ఇరవైనాల్గు గంటలూ కూర్చున్నా అడిగే వాళ్ళు వుండరు. "ఈ కాస్తలోనూ వెలితిపడి అతని చేత మాట పడటం ఎందుకు?" అని కొడుకు వైపు పగ్గాలు వేసి లాగుతున్నా మనసు నిబ్బరించుకొంటూంది. మళ్ళి మూడు రోజులదాకా చేద్దామన్నా తనకి పనివుండదు.

"నాని"ని తీరిగ్గా లాలించవచ్చు అని ఆశలు పడుతూంది.

కాని -

సీతకంటే ఎక్కువగా పాప మంజుని నాని ఏడుపు, అనారోగ్యం కలత పెడుతూంది.

**జరిగిన కథ- 20:** సీతకి పండులాంటి కొడుకు పుట్టాడు. వాడ్ని సీత 'నాని' అని పిలుచుకోసాగింది. పచ్చగా, బొద్దుగా ఉండే నానంటే ప్రభాకర్‌కి అప్పుడప్పుడూ అనురాగంతో హృదయం పులకరించేది. సీతంటే కూడా అతనికి అనురాగమే కానీ అదంతా అతని మనసుకి పరిమితం. తమ కుమారుని పెళ్ళికి పిలవడానికి ప్రభాకర్ మొదటి భార్య తల్లి, తండ్రి తమ రెండవ కూతురితో కూడా ప్రభాకర్ ఇంటికి వచ్చి వెళ్లారు. ప్రభాకర్‌కి మామగారు, అత్తగారు వచ్చి వెళ్లినప్పటి నుంచి మరి మరి సంధ్య జ్ఞాపకం వస్తూంది.

నిమిషానికొకసారి పెరట్లో సుబ్బులు దగ్గరకి వెళ్ళి నాని దగ్గర కూర్చుంటోంది.

తన బొమ్మలు గిలకలు చూపించి చిట్టి తమ్ముడ్ని వూరడించాలని చూస్తోంది.

కాని వాడు ఏడుపు ఆపటంలేదు.

అయినా మంజు అలాగే గుబులుగా వాడి దగ్గర ...తచ్చాడుతూంది.

అక్కడికి మనసు ఆగక -

"నాన్నా! పాపం ... నాని ఎందుకో బాగా ఏడుస్తున్నాడు నాన్న! జొరంట! ..." అంది అమాయకంగా తండ్రితో.

"... ..."

బుల్లి బుల్లి కాళ్ళు చేతులు ఆడిస్తూ బోసి నోటితో కిల కిలా నవ్వుతూ మెత్తగా గులాబి రేకులా వుండే బాబు అంటే మంజుకి విపరీతమైన ప్రేమ!

రెండేళ్ళు నిండిన స్వంత తమ్ముడు హరిబాబు మీద వుండే ప్రేమంతా ఇప్పుడు మూడు నెలలునిండిన "నాని" మీదకి మారిపోయింది.

మంజు చిన్న పిల్ల. దానిది పాల మనసు. కల్మషంలేని ప్రేమ. "నీ - నా" బేధం తెలియని అనురాగం. స్కూలు కాక మిగతా ఇంట్లో వుండే సమయం అంతా నాని పక్కనే కూర్చుంటుంది.

"పిన్ని! నువ్వు నీ పని చూసుకో. నేను నానిగాడ్ని ఆడిస్తాను ... బుజ్జి నాన్న ... చిట్టి తండ్రి ..." అంటూ వాడ్ని ముద్దులు పెట్టుకుంటుంది.

గిర గిరా గిలక తిప్పి చప్పుడు చేస్తుంది. రబ్బరు బొమ్మల్ని కిచ కిచుమనిపిస్తుంది.

నీళ్ళు పోశాక సీత నానికి పౌడర్ వేసి జుబ్బా తొడుగుతుంటే శ్రద్ధగా తిలకిస్తుంది. చాదుబొట్టు పెడుతుంటే కదిలిపోకుండా నాని చేతులు కాళ్ళు పట్టుకుంటుంది.

ఆ పసివాడు అంటే మంజుకి అంత ప్రేమ!

తనకి ఆడుకొందుకు తండ్రి కొనిచ్చిన ఎన్నో రకాల బొమ్మలకంటే నాని సజీవమైన బొమ్మలా కనిపిస్తాడు.



# జీవితం చేజారిందా

అటువంటి నాని ఇప్పుడు కడుపునొప్పో . . కాలు నొప్పో తెలియకుండా కెవ్వు కెవ్వున ఏడుస్తుంటే మంజు మనసు రెక్కలు తెగిన పక్షిలా తన్నుకొంటూంది

ఇంక ఆగలేక తండ్రికి చెప్పేసింది

కూతురు చెప్పిన విషయం విని ప్రభాకర్ మౌనంగా వుండిపొయ్యాడు!

నానికి ఐదవనెల నడుస్తుంది.

ఈ మధ్య వాడు తరచూ అలా ఏడవటం, తిరిగి సర్దుకోవటం అతనికి అలవాటు అయిపోయింది. చంటిపిల్లలు కాస్త గడికట్టేదాకా అలాగ నలతగా వుంటారు. అస్తమానం పోరు పెట్టి ఏడుస్తారు.

ఆ విషయంలో హరిబాబుతో నే బాగా అనుభవం అయ్యింది.

అందుకే మంజు చెప్పిన మాట విని నిశ్శబ్దంగా వుండిపొయ్యాడు.

అదీగాక సీతకి నర్సింగ్‌హోమ్‌లో అంతా తెల్సు. అక్కడే డెలివరి అయ్యింది. పైగా నానికి మూడవ నెల్లో పోలియో డ్రాప్సు అవ్వి వేయించటానికి కూడా తీసుకునివెళ్ళింది.

అందుకే అతడు ఎక్కువగా నాని గురించి ఆలోచించలేదు

అదీగాక సీత వచ్చి నాని సంగతి ఏమన్నా చెపితే అతడు ఏమి చేసేవాడో తెలియదు.

కాని సీత అడగలేదు.

అసలు ఇప్పుడేకాదు. పుట్టిన ఈ ఐదునెల్ల నుంచి "నాని" గురించి ఏ చిన్న విషయం అతనికి చెప్పలేదు. అతడి సహకారం అర్థించలేదు!

తనకిగా తాను ఎత్తుకోమని భర్తకి అందివ్వలేదు!

వాడి ఆటా పాటా ముద్దుగా ముచ్చటగా వినిపించలేదు! అసలు ఎప్పుడూ నాని ప్రసక్తి అతని దగ్గర తీసుకురాలేదు.

కారణం -

సీతకి బిడ్డలు పుట్టటం ప్రభాకర్‌కి అస్సలు ఇష్టంలేదు

ఆ విషయం అతని మాటల్లో, ప్రవర్తనల్లో స్పష్టం అయ్యింది .

అతని ప్రవర్తనవల్ల సీత హృదయం తీవ్రంగా గాయపడింది.

అయినా అతని అభీష్టానికి వ్యతిరేకంగా "నాని" పుట్టాడు.

భర్త అహంకారానికి మనసు విరిగినట్లయిన సీత చాలా విషయాల్లో నిర్లిప్తంగా వుంటూంది. ముఖ్యంగా "నాని" నా కొడుకు అనుకుంది

అప్పట్నుంచి ఆమె ప్రవర్తన కాస్త మూడిగా మారిపోయింది

భార్యాభర్తల మధ్య సాన్నిహిత్యం తగ్గింది.

మనసులు విప్పి మాట్లాడుకోవటం మానివేశారు. ముఖ్యంగా నాని




విషయంలో ఆమె చాలా జాగ్రత్తగా వుంటూంది

ఆ విషయం ప్రభాకర్ కూడా గమనించాడు

"ఆమెకే అంత అహం వుంటే నాకు మాత్రం ఏమిటి?" అనుకున్నాడు దర్పంగా.

మధ్యాహ్నం రెండున్నరకి ట్రైన్!

తనకి పిల్లలకి ప్రత్యేకం "కూపే" రిజర్వేషన్ చేయించుకున్నాడు.

టైము రెండుగంటలు కావస్తుంటే టాక్సీలో ప్రభాకర్, మంజు, హరిబాబు స్టేషన్‌కి వెళ్ళిపోయారు.

సీత దగ్గరుండి పిల్లల్ని కారులో ఎక్కించి లగేజి సర్దింది వాటర్ బాటిల్స్ నింపిన వెదురు బుట్ట అందుబాటుగా పెట్టింది

"సీతా! జాగ్రత్త. రెండు మూడు రోజులకంటే ఎక్కువ వుండను. సుబ్బులుంది కదా? రేపట్నుంచి రంగా కూడా పన్లోకి వస్తాట్ట జాగ్రత్తగా వుండండి ..." అన్నాడు ప్రభాకర్.

సీత నిశ్శబ్దంగా తల వూపింది.

పిల్లలిద్దరూ "టా ... టా ..." చెప్తుంటే టాక్సీ కదిలింది.

టాక్సీ గేటు దాటగానే సీత సంధించి విడిచిన బాణంలా రివ్వున పెరట్లోకి పరిగెత్తింది.

సుబ్బులు చేతుల్లోంచి "నాని"ని అందుకుని గభాల్న హృదయానికి హత్తుకొంది

గొంతు తెగుతున్న కోడిలా దీనంగా తెల్లవారి లేచిన దగ్గర్నుంచి ఒకటే ఏడుస్తున్నాడు.

ఏడ్చి ఏడ్చి ఆ పసివాడి కంఠం బొంగురుపోయింది.

లేత మొఖం అంతా కన్నీటితో నాని వుబ్బినట్లు అయ్యింది.

కళ్ళు వాచి రెప్పలు ఎర్రగా బార కత్తుల్లా మెరుస్తున్నాయ్.

ఒరేయ్ నాయనా! ఏడవకురా నా తండ్రి? నువ్వు ఏడిస్తే నే చూడలేనురా?"

సీత మనసు తల్లడిల్లిపోతూంది.

నాని లేత బుగ్గల మీద కన్నీరు కాల్వ కట్టింది

తల్లికేసి చూస్తూ జాలిగా ఏడుస్తున్నాడు

మధ్య మధ్య ఏడుపు ఆపి ... "అ ... మ్మా... అ ... మ్మ . . ." అంటూ వెక్కిళ్ళు పెడుతున్నాడు!

ఎంతో అనుభవజ్ఞురాలు అయిన సుబ్బులుకి కూడా ఎందుకో భయం వేసింది.ఏటూ తోచలేదు.

పొద్దునదాకా గోరు వెచ్చగా వున్న నాని ఒళ్ళు ఇప్పుడు సలసలా కాగిపోతూంది

రాను రాను టైము గడుస్తున్నకొద్దీ ఏడుపు తగ్గింది.

టెంపరేచర్ హెచ్చుతున్నకొద్దీ నాని మూసిన కన్ను తెరవకుండా చొప్పకట్టలా మంచంలో పడివున్నాడు.

పాలు పడితే తాగటంలేదు.

కళ్ళు తెరిచి తల్లిని కూడా చూడటంలేదు.

......

అప్పటికి సమయం మూడు గంటలు కావస్తూంది. క్షణాల్లో పెరిగిన జ్వర తీవ్రతకి కనురెప్పలు, చెంపలు ఎర్రగా వాచి పొంగినట్లు అయ్యాయి.

"నానీ! నాయనా .. నా బంగారు తండ్రి. నీకేమయిందిరా ... పాలు తాగుతావా తండ్రి? ఇటు చూడు ..." అంటూ సీత ప్రేమతో కొడుకుని తట్టి పిలుస్తుంటే నీరసంగా కనురెప్పలు తెరిచి తల్లి మొఖంలోకి చూసి తిరిగి కళ్ళు మూసుకొంటున్నాడు నాని.

వాడి స్థితి చూస్తుంటే సీతకి మనసు విలవిల్లాడిపోతూంది

మరి అంత పసిపిల్లల పెంపకంలో సీతకి అనుభవం లేదు. ఏదో ఆడే పాడే పిల్లల్ని లాలించటం మాత్రమే తెలుసు.

కళ్లల్లో గిర్రున నీరు నిండుతుంటే -

"సుబ్బులూ! నాకెందుకో భయంగా వుందే ..." అంది బేలగా.

"అవునమ్మగారూ! ఇందాకటి దాక ఒళ్ళు చల్లగా వుంది. నిమిషాల మీద వెచ్చబడిపోనాది. పడిశం మూలంగానా అనుకున్నా మరి ఇంత ఘనంగా

# కోటయ్య అనుభవం- కోటయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు ...




























SAA/NIA/2802/TL

ర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
దా ఏజెంటును కలవండి.



**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

ష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# జీవితం చేజారిందా

ఏడుస్తారా? కడుపు నొప్పో ఏమో అని కాపడం గూడా ఎడితెని .." అంది బాధగా గొడవారగా చతికలపడుతూ.

ఇలా నానికి తరచూ జలుబు చెయ్యటం ... లేక కడుపు నొప్పితో ఏడవటం .... చిట్కా వైద్యం చేస్తుంటే తగ్గటం జరుగుతూనే వుంది.

కాని ఈసారి పరిస్థితి వేరుగా కనిపిస్తుంది. సీతకి గుండె గుబులుగా అయ్యింది. చప్పున ఆమెకి డా. ఆనంద్ జ్ఞాపకం వచ్చాడు.

అతడు తరచూ వస్తూ వుండడం వల్ల వాళ్ళ మెటర్నటీ హోమ్‌లో పురుడు పోసుకోవటం వల్ల అతనితో కాస్త బాగానే పరిచయం వుంది

"సుబ్బులూ ..."

"అమ్మా ..."

"ఇదిగో చూడు! నానిని చూస్తే నాకు ఎందుకో భయంగా వుంది. ఇంక మనవల్ల కాదుగాని ... డా. ఆనంద్‌గారికి ఫోన్ కలుపుతాను. నానికి ఒంట్లో బాగుండలేదని, నేను వెంటనే బయలుదేరి రమ్మన్నానని ... చెప్పు" అంటూ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి ఫోన్ ఎత్తి నంబరు డయల్ చేసింది.

అవతల్నించి రెండు నిమిషాల్లో జవాబు వచ్చింది. వార్డ్‌లో రౌండ్స్‌కి వెళ్ళిన డా. ఆనంద్ లైన్‌లోకి వచ్చాడు.

సుబ్బులు మాట్లాడింది.

పావు గంట గడవక ముందే ఇంటి ముందు డా. ఆనంద్ కారు ఆగింది.

ఆయన్ని చూస్తూనే కట్టతెగిన వరదలా సీతకి దుఃఖం పొంగివచ్చింది.

మంచంలో చొప్పకట్టలా నిస్త్రాణగా పడుకున్న నానిని చూస్తూనే అతని భ్రుకుటి ముడిపడింది.

"ఎప్పట్నించమ్మా సుస్తీ?" అన్నాడు స్టెత్‌తో నానిని పరీక్షచేస్తూ.

"నిన్న మొన్న కాస్త నలతగా వున్నాడు మామూలు జలుబే కదా అనుకున్నాను. కాని మధ్యాహ్నం నుంచి క్షణాల్లో జ్వరం పెరిగిపోయింది. ఇందాకటి దాకా బాగా ఏడిచాడు. కాని ఇప్పుడు పిలిచినా పలకడంలేదు ..." అంది ... కన్నీళ్ళు గొంతుక్కి అడ్డం పడుతూంటే ఆమె మాట తడబడింది.

"అరె! ప్రభు నాతో మాట మాత్రం అయినా అనలేదే? నిన్న కూడా కాంప్లెక్సు దగ్గర కలిశాం......" అని విస్తుబోయ్యాడు.

"అయ్యగారికి కూడా సరిగ్గా తెలియదులెండి డాక్టరుగారూ! కడుపునొప్పి అన్నాము. గ్రైప్‌వాటర్ తాగించాం. తగ్గలేదు. ఆముదం రాసి కడుపుకి వుప్పు-ఓము అద్ది కాపడం కూడా పెట్టాను. తగ్గలేదు. దిష్టిపోరేమో అనుకున్నాం. బాగా జలుబు చేసింది. ఇందాకటిదాకా ఒళ్ళు గోరెచ్చగానే వుందయ్యగారూ! క్షణాల్లో! జొరం ఎక్కిపోనాది. పసిబిడ్డ..... మూసిన కన్ను తెరవకుండా అయ్యాడు." అంది సుబ్బులు.

దాని కంఠంలో కూడా బాధ, ఖంగారు స్పష్టంగా కదులుతున్నాయి.

నాని పుట్టినప్పట్నించి వాడి సంరక్షణ సగం దానివంతే!

సీత పన్లో వున్నంత సేపు నాని సుబ్బులు వొళ్ళోనే వుంటాడు.

సీత నిశ్శబ్దంగా గొడవారగా నిల్చుని కన్నీరు కారుస్తూ వుండిపోయింది.

మసకేసిన చందమామలా వుంది ఆమె వదనం.

మనసంతా కలతబారి పోయింది.

బయటపడనూలేక, లోపల ఇమడనూలేక "వల"లో పడ్డ చేపలా వుంది ఆమె పరిస్థితి.

డాక్టరు ఆనంద్ పరీక్షలు పూర్తి చేసి మందులు బయటకి తీశాడు.

"మీరేం దిగులుపడకండి సీతగారూ! నేను రెండుపూట్లా వచ్చి చూస్తాను. అవసరం అయితే అర్ధరాత్రి అయినా సందేహించకుండా ఫోన్ చెయ్యండి....." అన్నాడు ధైర్యం చెపుతూ.

" ........."

"చిన్న పిల్లల విషయంలో అశ్రద్ధ చెయ్యకూడదు. చాలా జాగ్రత్తగా వుండాలి." అంటూ సలహా ఇచ్చాడు.

ఇంజక్షన్ చేసి, కొద్దిగా టాబులెట్‌పొడి తేనెలో కలిపి పట్టమని చెప్పాడు.

"అయ్యగారూ? మరేం భయంలేదుకదా?" అంది సుబ్బులు అమాయకంగా.

డా. ఆనంద్ చిరునవ్వు నవ్వాడు.

"మరేం భయంలేదు. తెల్లవారేసరికల్లా నాని హాయిగా పాలుతాగి ఆడుకుంటాడు........" అన్నాడు లేస్తూ.

సుబ్బులు మెడికల్ కిట్ అందుకుని కారులో పెట్టింది.

డాక్టరు వచ్చి వెళ్ళాక సీతకి కొంచెం ధైర్యం చిక్కినట్టయింది.

మందు ప్రభావమో లేక జ్వర తీవ్రతో తెలియదు.... కాని... నాని... ఆదమరచి మంచంలో నిద్రపోతున్నాడు.

ఉదయం నుంచి వాళ్ళ ప్రయాణం హడావుడివల్ల ఇల్లంతా అస్తవ్యస్తంగా వుంది.

సీత నెమ్మదిగా లేచి ఇల్లంతాసర్ది చిన్న చిన్న పన్లు వుంటే చక్క పెట్టుకొంది.

సుబ్బులు గిన్నెలుతోమి "అమ్మగారు! నేనోసారి ఇంటికెళ్ళి వస్తానమ్మగారూ! మా అత్త ముసల్ది! సెసుకోలేదు. అన్నం కుంత పొయ్యికెత్తి జల్దీ వచ్చేస్తాను...." అంది.

"సరే వెళ్ళిరా...." అంది సీత.

సీత ప్రొద్దున్నుంచి ఎమి తినలేదు. అయినా ఆమెకి ఆకలిగాలేదు. తినాలి అనిపించటంలేదు.

మనసంత నిరాశ ఆవరించింది.

కొద్దిగా కాఫీతాగి నాని మంచం దగ్గరకివచ్చి కూర్చుంది.

క్రమంగా ప్రొద్దువాలి సంజె చీకటి పడింది.

ఆమె ముఖం గంభీర ముద్ర దాల్చింది.

ఇంట్లో సందడిగా కిలాకిలా నవ్వులు కురిపిస్తూ, ఏడుస్తూ వుండే నాని అలా నిశ్శబ్దంగా మంచంలో పడుకుంటే సీతకి మనసంతా దిగులుగా ఎలాగో అనిపించింది.

దానికితోడు పాప, బాబు కూడా లేకపోవటంతో ఇల్లంతా బిక్కు బిక్కుమంటున్నట్లు బోసిగా అనిపించింది.

ఏడు గంటల ప్రాంతంలో సుబ్బులు వచ్చేసింది.

"తెల్లవారేసరికి తగ్గిపోతుందని చెప్పారుకదా డాక్టరుగారు....." అనుకుంది తనకి తను ధైర్యం చెప్పుకుంటూ.

ఆ రాత్రి ఎలాగో తెల్లవారింది.

కాని రోజు గడిచేసరికి నాని పరిస్థితి పూర్తిగా ఆశాభంగం అయ్యింది.

కాస్త తగ్గినట్టే అనిపించి తెలతెల్లవారుతుంటే నానికి హై టెంపరేచర్ వచ్చేసింది.

(ఇంకా ఉంది)



# దోపిడి

పాలగిరి వేణు

హోటల్ కాకతీయ....

శివశంకర్రాజు నుండి శెలవు పుచ్చుకుని "చెక్అవుట్" అయ్యేసరికి ఐదు ముప్పావయింది....

'కృష్ణా" కెళ్ళాలి.... ఆటోను తీసుకొచ్చాడు రూంబాయ్.... ఆటోవాలా పదహే నడిగాడు.... చాలా ఎక్కువన్నాం.... మరో ఐదు నిముషాలు బేరసారాలు నడిపాక, పన్నెండుకు కుదిరింది.... పన్నెండు కూడ ఎక్కువైనా ఆరుంపావుకల్లా "కృష్ణా ఎక్స్ప్రెస్" వుండటం మరో గత్యంతరం లేక అంగికరించ వలసి వచ్చింది.... సామాన్లు ఎక్కువని, మేమిచ్చేది తక్కువని, బోణీ బేరం కావటం వల్ల ఒప్పుకోవాల్సి వచ్చిందని సణుగుతున్నాడు ఆటో డ్రైవర్....

సికింద్రాబాద్ స్టేషన్ చేరేసరికి సరిగ్గా ఆరుగంటల అయిదు నిముషా లయింది....

"ఆటో స్పీడుకు" ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకున్న మేము, ఆటో దిగుతూనే స్వేచ్ఛగా వూపిరి పీల్చుకున్నాం.... ఒక పది, ఒక ఐదు నోట్లు డ్రైవర్‌కు అందించాను. అతడు జేబులన్నీ వెతికి, యిక లేనట్లుగా ఓ పాత రెండు రూపాయల నోటు అందించాడు.... రూపాయ లేదన్నాడు.... సరిగ్గా చూడమన్నాం.... మేమిచ్చిన పదహేను మాకే తిరిగి యిస్తూ పన్నెండును సరిగా యివ్వమన్నాడు విసుగ్గా!.... ఇక లాభం లేదనుకుని, ఆ రెండును అందుకుని, మా పదహేనును అప్ప జెప్పేశాం... చిల్లర బాధితులం కదా! మరి....

చూశావా! డ్రైవర్ ఎంత మంచాడో? కనీసం రెండైనా తిరిగి యిచ్చాడు ఏ ఒక్క రూపాయో మన చేతిలో పెట్టి.... నా దగ్గరుండేది యింతే! అంటే ఏం చేసే వాళ్ళం....?" అంటూ శ్రీనివాసన్ సిగరెట్ వెలిగించు కుంటున్నాడు.



"ఏం చేసే వాళ్ళం.... నోర్మూసుకుని నెత్తిన చేతులు పెట్టుకునే వాళ్ళం...." అన్నాన్నేను....

"ఎక్కడి కెళ్ళాల్సార్?" అంటూ మా కెదురుగా ఓ పోర్టరు నిలుచున్నాడు. చెప్పాను....

"పదివ్వండి!"

"పదా?!" అంటూ ఆశ్చర్యపోయాను..

వెంటనే 'సూట్‌కేస్' అందుకుని నెత్తిన పెట్టుకుని, మిగతా రెండు "సూట్‌కేసులు" దాని మిద పెట్టమన్నట్లు సైగ చేశాడు పోర్టర్....

"అదేంటయ్యా! బాబూ!! బేరం కుదరకనే సామాన్లు నెత్తి నెట్టుకున్నావ్?" అంటూ శ్రీనివాసన్, పోర్టర్ నెత్తిమిద నున్న సూట్‌కేసును అందుకున్నాడు.... ఏదైనా సరే! ముందు బేరం లేకుండా వ్యాపారం చేయడు శ్రీనివాసన్.

"ఈ సార్ పదమని చెప్పాడు..." అంటూ నా వైపు చూశాడు పోర్టర్! ..

"పదమనలేదయ్య బాబూ! పది రూపాయలే అని అన్నా"

"పోనీ ఎంతిస్తారు దొరా?"

"ఆరిస్తాం" అంటూనే శ్రీనివాసన్, పోర్టరును, సామాన్లను నాకు వదిలి, రామగుండం వెళ్ళేందుకు "ఫస్ట్ క్లాస్" కౌంటర్ వైపు నడిచాడు....

"మిరు వెళ్ళాల్సిన బోగి యిాటికి చాలా దూర ముంటుందయ్యా! చూసి మిరే యివ్వండి..

"చూడు బాబూ! మేము యీ వూరికి కొత్త కాదు కాని మాయచేయడానికి ..?" అని అంటూ యింకో పోర్టరెవరైనా వస్తే బావుణ్ణు అనుకుంటూ దిక్కుల చూడసాగాను...

"ఏంసార్! మాయ గియ అంటున్నారు.. మేము న్యాయంగానే అడుగుతున్నాం' అన్నాడు కొంత కర్కశంగా పోర్టరు ..

"ఎందుగ్గాని బాబూ! నీ వడిగినట్లు పదివ్వలేం గాని వేరే బేరం చూసుకో? ఇప్పటికే ఆలస్య మయినట్లుంది" అంటూ శ్రీనివాసన్ టికెట్లతో పాటు వచ్చాడు.

"ఏంసార్! అలాగంటారు? తక్కువ సామాన్లున్నాయటండి!!'

"చూడు బాబూ! ఇచ్చే వాళ్ళం మేము పుచ్చుకునే వాడివి నీవు.. "

"పోనీ ఎనిమిదివ్వండి సార్! పుచ్చుకుంటాను....' అన్నాడు పోర్టరు.... కొంత దిగుతున్నాడు గురుడు.

"చూడు పోర్టర్ మహాశయా! ఆరుకన్నా ఎక్కువ యిచ్చుకోలేం నాయనా?"- అన్నాడు శ్రీనివాసన్ కొంత వ్యంగ్యంగా!

"ఇక మి యిష్టం సార్!" అంటూ పోర్టర్ వెళ్ళిపోలేదు.... మాకు కొంత దూరంలో నిలబడ్డాడు....

మరో పోర్టర్ కనపడితే పరుగెట్టి కెళ్ళాడు

# "దోపిడి"

శ్రీనివాసన్.... ఆ పోర్టర్ వచ్చాడు....

"పదిహేనివ్వండి సార్!" అంటూ సామాన్ల వైపు మరోసారి చూస్తూ!....

ఇక బేరం చేయడానికి కూడా నోరు పెగల్లేదు. .

"వద్దులే బాబూ! వేరే బేరం చూసుకో?" అని అన్నాను...

"వెధవ బోణి! వెధవ బోణి!!.... అంటూ గొణుక్కుంటూ.... "ఓ పదైనా పారేయండి!..." అని అన్నాడు విసుగ్గా!

"ఒరే! వెంకన్నా!! సార్లు ఆరుకన్నా ఒక్క పైసా కూడా యివ్వరట్రా!" అంటూ మా పాత పోర్టర్ మళ్ళీ రంగ ప్రవేశం చేశాడు...

"అవును.... ఆరుకన్నా ఒక్క పైసా కూడా యివ్వం...." అంటూ మూతి బిగించాడు శ్రీనివాసన్....

ట్రైనుకు యింకో పది నిముషా లుంది.... మాలో కూడ కొంత పట్టుదల పెరిగింది... చూద్దాం! ఉన్నవి మూడు సూటు కేసులు, మరో రెండు చిన్న బ్రీఫ్‌కేసులు, చిన్న పళ్ళ గంప.... అంతే!

మేమే మోసుకుని వెళ్దామంటే ఒకేసారి తసుకెళ్ళాలి? ఎలా?? మా కంపార్ట్‌మెంటు వెతుక్కుని మా "సీట్ల" లోనికి తీసుకెళ్తే! ఒకేసారి మోయగలమా! పోనీ నేనిక్కడుండి, శ్రీనివాసన్‌ని తీసుకెళ్ళమంటే?.... పోనీ తీసుకెళ్తే కంపార్ట్‌మెంట్లో ఎవరో తెలిసిన వాళ్ళుంటే ఫరవాలేదు లేకపోతే? ఈ మధ్య రైళ్ళలో దొంగతనాలు కూడ ఎక్కువవుతున్నాయట కూడాను...

"పోనీ ఎనిమిదిచ్చేయండి సార్!" అంటూ మళ్ళీ సూటుకేసందుకుని నెత్తిన పెట్టుకో బోయాడు... రెండో పోర్టర్ మమ్మల్ని చీదరింపుగా చూసి వెళ్ళి పోయాడు....

"ఏం బరువుందని ఎనిమిది అడుగుతున్నావ్?" అన్నాడు శ్రీనివాసన్...

మళ్ళీ మొదటి కొచ్చింది వ్యవహారం.... ఈ పోర్టర్ మమ్మల్ని వదిలేటట్టుగా లేదు... పోనీ ఎనిమిది యిచ్చేస్తే?....

"ఒరి! అప్పిగా!! దొరలు ఏడిస్తారు గాని.... ఎళ్ళు.... "అంటూ యింకో పోర్టర్ వచ్చి సూటుకేసులు మా పోర్టర్ నెత్తిమీద సర్దేసి, బ్రీఫ్‌కేసు లందివ్వ మన్నాడు...

"పోనీ లేద్దూ! టైమవుతోంది" అన్నాను శ్రీనివాసన్‌తో ....

శ్రీనివాసన్ యింకేం మాట్లాడ లేదు....

అయినా దొరలు ఏడిస్తారు.... అంటే ఎనిమిది యివ్వటానికి ఏడుస్తున్నారనా? పోనీ ఆరే తసుకోమనా? లేక ఏడు రూపాయ లిస్తారనా??....

అప్పి అనే మా పోర్టర్‌కు బ్రీఫ్‌కేసు లందివ్వలేదు మానవతా దృష్ట్యా! ఆ సూటుకేసు బరువు లెంతున్నాయో మాకు తెల్సు.

ప్లాట్‌ఫారమ్మీద పెద్దగా ప్రయాణీకుల్లేరు....

"అప్పి" పరుగు లిడుతున్నాడు.... వెంట నేను....

శ్రీనివాసన్ నెమ్మదిగా నడుస్తున్నాడు....

మా చేతుల్లో బ్రీఫ్‌కేసులూను....

అప్పి ఆగాడు.

"బ్రీఫ్‌కేసులు కూడ యిలా యివ్వండి సార్!"

'మేమే తెస్తాంలే!" అన్నాను...

శ్రీనివాసన్ పళ్ళ బుట్ట అందించాడు అప్పికి....

అప్పి కదిలాడు.... వేగంగా!... సూటుకేసులు బరువు బాగా వున్నట్టుంది. మోయలేక పోతున్నా-డేమోననిపించింది.... కొంత దూరం నడిచాడు... ఆగాడు.... మళ్ళీ చిన్న పరుగు .... వేగంగా నడవటం వల్ల చెమట్లు పడుతున్నాయి... ఎర్రటి తుండుతో ముఖాన్ని తుడుచుకుంటూన్నాడు. పోనీ ఒక సూటుకేసు అందుకుంటే!.... ! అమ్మో!! ఏడు రూపాయల్ని ఏడుస్తూ యిస్తూనే! ఊహూ!!అప్పిలో వేగం తగ్గింది... నెమ్మదిగా నడుస్తున్నాడు..... శ్వాస తగ్గి ఆయాసం పెరిగింది. అప్పి అడిగినట్లు యింకో రూపాయి యిచ్చేద్దాం! ఎంత కష్టపడుతున్నాడు... ఒక్కరూపాయి ఆదా చేస్తే మనకు వరిగేదేమి లేదు... ఇందాకా ఆటో వాలా చిల్లర లేదంటూ ఎగనామం పెట్టలే! అప్పి ఎంతో నిజాయితీగా అడిగాడు,.. మనం మోయలేని బరువు తను మోస్తాడు.... ఆ మోయడం తన బాధ్య తంటాడు అప్పి.... కాని ఆ బాధ్యత బరువు మనం మోయాల్సి వుంటుంది ఆర్థిక దృష్ట్యా!... ఏది ఏమైనా అప్పికి యింకో రూపాయి అదనంగా యిచ్చి అతని కష్టానికి విలువ యివ్వాలి.... అప్పి చేతుల్లోంచి బలవంతంగా పళ్ళ బుట్టను లాక్కున్నాను....

అదేంటి రైలు చివరంటూ వచ్చేశాం... మా 'బోగి' దొరకందే!

అప్పి ఆగాడు... 'బోగి' గురించి యింకో పోర్టరుతో అడిగాడు–

"ముందుగాలే వుండాలి.... 'దక్షిణ్' వస్తోందట" అంటూ ఆ పోర్టర్ మరో ప్లాట్‌ఫారం వైపు పరుగులు తీశాడు.

మళ్ళీ వెనక్కి ప్రయాణం!.....

ఈసారి మరింత వేగం... పరుగు.... ఊపిరి ఎగబోసుకుంటూ అప్పి..... సూటుకేసులు జారిపోతున్నాయి... వాటిని సర్దుకుంటూనే అడుగు లేస్తున్నాడు. పళ్ళ బుట్ట తాడు నా చేతికి మరింత రాపిడి తగిలించి కోసుకు పోతూ మంట పెడుతోంది.... చేతులు మార్చు కున్నాను...

అప్పి షర్టంతా చెమట్లు పట్టి దాగులు పడుతున్నాయి.... నేను అప్పి వెంట నడుస్తూనే శ్రీనివాసన్ కోసం తిరిగి చూశాను....

'కాఫీ కౌంటర్' ముందు శ్రీనివాసన్ కాఫీ తాగుతూ, సిగరెట్ పీలుస్తున్నాడు నింపాదిగా!

'అప్పి' అలిసి పోతున్నాడు.... కాళ్ళు తడబడుతున్నట్లు, మెడలు సూట్‌కేసుల బరువుతో వంగి పోతున్నట్లు న్పించింది.... పాపం!రూపాయేమిటి? ఇంకో రెండు యిచ్చినా అప్పి కష్టానికి ఫలితం తక్కువే! ప్రతి 'బోగి'

# గడుసులోకం — బాబు







చూసుకుంటూ వెళుతున్నాం . .

"ఇదో! ఇదే సార్!" అంటూ అప్పి ఉదాటున బోగిలోనికి దూకేడు... పై 'బెర్త్' మిద సూటుకేసులు సర్దాడు . . ఓ మూలగా నిలబడి, డబ్బుల కోసం చేయి చాచాడు .. ఇంతలో శ్రినివాసన్ వచ్చాడు

"చూశారా! రాజూ గారూ!" ఎంట్రన్స్ గేట్ కెదురుగానే వుంది మన బోగి! ఎదురూగ్గా వున్న కంపార్ట్ మెంట్ దాటించేసి, రైలు చివరకంటూ నడిపించి, మళ్ళీ వెనక్కి తిప్పి ఏడు రూపాయల్ని మాయ జేసి కాజేస్తున్నాడు! ఎంత మోసం .. " అంటూ శ్రినివాసన్ తన చేతిలోటి బ్రీఫ్ కేస్ సీట్లో వుంచుతూ!....

అవును. .. ఎదురుగ్గానే వుంది ఎంట్రన్స్ గేట్'. ... అక్కణ్ణించే ప్లాట్‌పారమ్మీదకు వచ్చాం! అయినా మాది తప్పే! బోగి ఎక్కడుందో కూడ చూడకుండా 'అప్పి' వెనకాలే గొర్రెలా వెళ్ళడం తప్పుకాదూ! ...

"భలే వాడివోయ్! 'గేట్' ఎదురుగానే కంపార్ట్‌మెంటుంచంటే ఏ రెండో మూడో యిస్తామని .. ఎక్కడో దూరంగా వున్నట్లు నాటకమాడి.... నితో పాటు మమ్మల్ని కూడ పరుగు లెత్తించి మాకు 'ధోకా' యిస్తున్నావ్? ఈ 'బోగి' యిక్కడుందని తెలిస్తే మేమే మోసుకునే వాళ్ళం ... " అంటూ ఎగొసెక్కంగా అన్నాను ...

."నాకు నిజంగా తెలీదండి సార్! రోజు రైలు చివర్లోనే యీ బోగి వుండేది.. . ఈ రోజే మారినట్లుంది.... " ఎంతో అమాయకంగా అన్నాడు అప్పి....

మాయకబుర్లు చెప్పకు? ఇదిగో ఈ నాలుగూ వుంచేసుకో? యింతకన్నా యిచ్చేది లేదు... " అంటూ శ్రినివాసన్ రెండు రెండు నోట్లను పోర్టర్ అప్పికి అందించాడు...

అప్పి అందుకోలేదు. . .

"అదేంటి బాబూ! ఒట్టి నాలుగా!! నేను పడ్డ కష్టం చూశారు. ఇది అన్యాయం బాబూ! ఏడు యిచ్చేయాలి అంతే! " నిర్కర్షగా చెప్పాడు అప్పి....

నాకు మండుకొచ్చింది అప్పి వాలకాన్ని చూసి ...

అప్పి ఆడింది నాటకం కాదూ? సునాయాసంగా మమ్మల్ని మోసం చేయలేదూ!!

"సర్లే! నీవు పడ్డ కష్టానికి యీ నాలుగూ చాలదూ!.... తీసుకో?" అన్నాను....

"న్యాయంగా యివ్వండి దొరా! 'బోగి' సంగతి నాకు తెలియదని సత్తె ప్రమాణంగా చెప్తున్నా బాబూ! మి సూటుకేసుల బరువుకు నా మెడ నరాలు పట్టుకు పోయాయి బాబూ!" అంటూ బతిమాలుతున్నాడు అప్పి....

అప్పి నిజం చెప్తున్నాడనే అని పించింది నాకు.. . పోనీ ఆ మూడూ యిచ్చేస్తే!....

ఈ నాలుక్కన్నా ఒక్క పైసా కూడా యిచ్చేది లేదు!.... ప్రతి వెధవ అవకాశం దొరికిందని ఎదుటి వాణ్ణి బుట్లో పడేయడమే! ఇంద తీసుకో" అంటూ నోట్లను తీసి అప్పి చేతుల్లో బలవంతంగా కుక్కాడు శ్రినివాసన్ ...

మారైలు కూతేసింది. . దక్షిణ్ వస్తున్నట్లు. . . కృష్ణా కదులుతున్నట్లు 'అనౌన్స్' చేశారు. .

"బాబూ!....."

"వెళ్ళవయ్యా! వెళ్ళు" కసిరాడు శ్రినివాసన్....

నా జేబుల్లోంచి మిగతా మూడు తీయబోయాను....

ఇంతలో రైలు నెమ్మదిగా కదిలింది. . అప్పి దిగేశాడు. ..

'థూ! ఏమ్మనుషులండీ' కష్టం విలువ తెలియని మారాజులు మిరు న్యాయం ఏమనుకుంటున్నారో అంతే తీసుకుంటున్నా! మిగతా యీ రెండు రూపాయలు మిరే వుంచేసుకోండి.... పొట్ట కొట్టే వాడెవడూ బాగుపడడు బాబూ!" అంటూ కిటికిల్లోంచి ఓ రెండు రూపాయల నోటును మా సీట్ల వైపు విసరేసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు అప్పి.. .

ఆశ్చర్య పోవటం మా వంతయినా?..

మాకు కష్టం విలువ తెలియదా? మేము శ్రమశక్తిని దోచుకున్నామా? అప్పి 'నిజాయితీకి' శ్రమ విలువను ఆపాదించ లేక పోయామా? ఎవరిని ఎవరు దోచుకుంటున్నారు? ఎక్కడుంది పొఱపాటు.... ?

అప్పి పడుతున్న కష్టాన్ని చూసి యింకో రెండు రూపాయలు అదనంగా యివ్వాలనుకున్న నేను, కనీసం మాట ప్రకారం కూలీడబ్బు "ఏడు" కూడ పూర్తిగా ఎందుకు యివ్వలేక పోయాను.... ఏంటో ?మరి.... శ్రమ శక్తిని అవకాశ వాదం దోచుకుంటూంటే యింకేం చెప్పను? నా కాళ్ళకింద పడ్డ అప్పి విసిరిన ఆ రెండు రూపాయల నోటు, ఉవ్వెత్తున వీచిన గాల్లోంచి పై కెగిరి.... కిటికి ముందు రెండు గిరికీలు కొట్టి బయటకు తుర్రుమంది ..

ఈ సారి నిజంగా ఆశ్చర్య పోయాను.....

శ్రినివాసన్ యివేమి గమనించనట్లు సిగరెట్ పీలుస్తూ, 'ది ప్యాన్ క్లబ్'లో మునిగి పోయి వున్నాడు.... □

## స్వర్గం - నరకం

ఇంటి తలుపు తీశా
బోసి నవ్వుల్తో పాప
సిరివెన్నెల కురిపిస్తూంది
స్వర్గం కనిపించింది!

పక్కనే తల్లి
పొయ్యి మీద ఎసరుపెట్టి
చారెడు నూకల్ని చాటలో ఏరుతూంది
నరకం కనిపించింది!

స్వర్గానికి
నరకానికి
ఒకటే ద్వారం!

- అడిగొపుల వెంకటరత్నమ్

# త్వరలో ప్రారంభం!

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు

## ప్రముఖ ఆయుర్వేద ఔషధాల తయారీ సంస్థ బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు!

పాఠకులు తమ ఆరోగ్య సమస్యలకి **"బైద్యనాథ్ ఆరోగ్య దీపిక"** శీర్షిక కింద ఆయుర్వేద వైద్య చికిత్సా విధానంలో సమాధానాలని ఉచితంగా పొందవచ్చు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరూ ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవలసిందిగా కోరుతున్నాము.

**"బైద్యనాథ్ ఆరోగ్య దీపిక"** శీర్షికకి ప్రశ్నలని పంపేవారు తమ ఆరోగ్య సమస్యలని ఈ కింద ఇచ్చిన కూపన్‌లో రాసి దానిని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003 అనే చిరునామాకి పంపాలి. ఒక్కొక్క కూపన్‌లో ఒక్కొక్క ప్రశ్నని మాత్రమే పంపాలి. కూపన్ లేకుండా పంపిన ప్రశ్నలని పరిశీలించటం జరగదు.

------------ కూపన్ ------------

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న :..................................................

..................................................

..................................................

పంపినవారి పేరు :____________________

పూర్తి చిరునామా :____________________

______________________________

"ఏం చెప్పమంటారు డాక్టరుగారూ?
మేం నిజంగా గొడవలో పడ్డాం. మీకు తెలుసో
తెలీదోగానీ అన్ని రకాలూ వాడి చూసాం మేం.
అయితే అవేవీ వారికి నచ్చకపోవడం లేదా నాకు
పడకపోవడం.

ఇది నిజంగా ఓ సమస్య అయికూర్చుంది.
దీని గురించి మా మధ్య రోజూ చర్చే.

నాకు ఆయన సరదా తీర్చాలనుంటుంది.
అయితే ఎలాగో మాత్రం తెలీడం లేదు.

మీరే ఒక దారి చూపి మాకు సాయపడాలి."

ఇదిగో మీరు ఎదురుచూస్తున్న పరిష్కారం.
ప్రపంచమంతటా డాక్టర్లు వెజైనల్ కాంట్రాసెప్టివ్స్ (స్త్రీలకోసం గర్భ నిరోధక సాధనం) సిఫార్సు చేస్తున్నారు. ఆ మాటకొస్తే, వెజైనల్ కాంట్రాసెప్టివ్స్‌ని 60 కన్నా ఎక్కువ దేశాలలోని లక్షలాది స్త్రీలు అనేక ఏళ్ళుగా వాడుతున్నారు. నమ్మకంగా.

ఇప్పుడు ఆ విజయవంతమైన స్వకీయ గర్భ నిరోధక విధానం భారతదేశానికి వచ్చింది మొట్టమొదటిసారిగా.

దాని పేరు 'టుడే'. వెజైనల్ కాంట్రాసెప్టివ్స్‌కు మార్గదర్శకులు, ప్రపంచనాయకులైన డబ్ల్యు జె. రెండెల్, యు.కె. వారి సహకారంతో తయారుచేయబడుతోంది.

స్త్రీలు కోరేది 'టుడే'. 'టుడే' సురక్షితమైనది గనక. 'టుడే', ఎంతెంతో అమోఘమైనది. హార్మోనులు లేనిది. దీంతో వేరే అనవసరపు బాధలు ఎదురవవు.

'టుడే' అనువైనది.

పురుషులు 'టుడే'ని మెచ్చుకుంటారు. మీరు పంచుకునే ఆ సన్నిహితత్వానికిది అటంకం కాదు గనక.

'టుడే' మరేదో కాదు.
డాక్టర్ ఆదేశించేది అదే.




Today
వెజైనల్ కాంట్రాసెప్టివ్
గర్భ నిరోధక సాధనాలు నచ్చనివారు మెచ్చే కాంట్రాసెప్టివ్.

# మంత్రపత్రాలు

— కలువకొలను సదానంద

పద్నాలుగేళ్ళు అరణ్యవాసం చేసిన శ్రీరాముడి కెక్కడిది ఈ సంబరం? అజ్ఞాతవాసం పూర్తి చెయ్యగలిగిన పాండవుల కెక్కడివీ ఈ ఆనందోత్సాహాలు? ఎన్నాళ్ళు!... ఎన్నేళ్ళు... సాటి-వారిలో కొంచెం మేటిగా వుండాలనుకున్న ప్రతివాడికీ – గడిచిపోయిన ఒక్కో ఏడూ ఒక్కో మన్వంతరమే కదా? అలాంటివారిని శోభనం రాత్రిలా ఉవ్విళ్ళూరిస్తూ ఇప్పటికొచ్చి పడ్డాయి పంచాయత ఎన్నికలు!

పద్దెనిమిదేళ్ళూ నిండిన ప్రతివాడూ యిప్పుడు కులదైవం. మొక్కితే వేల్పు వరమిస్తాడన్న అపప్రధ వున్నది కనుక, మొక్కులకు కొదవలేదు. అయితే గుళ్ళో దేవుడిలాగా రాయికాదు గదా ఓటరు? వాడికి బుద్ధి జ్ఞానం వున్నాయి. ఓటు విలువ వాడిక తెలుసు! ఎంతమంది చేతులెత్తి మొక్కినా, ఓటుపడేది మాత్రం తనకు నచ్చిన ఏ ఒక్కడికి మాత్రమే! పోటీ చేస్తున్న అందరిలో ఎవడో ఒకడు పరమయోగ్యుడని తేల్చిపారేస్తుంది భారత ప్రజా హృదయం.

ఇన్నాళ్ళూ పొలం పుట్రా, ఆస్తి ఐశ్వర్యం సంపాయించుకుని, వ్యాపారంలో లక్షలకు లక్షలు పోగుజేసుకుని ఇప్పుడు తిరిగ్గా వీధులవెంట నడుస్తూ, తనకు ఓటియ్యమంటూ అన్నానికి ముఖం వాచిన వాడికంటే హీనంగా, దీనాతిదీనంగా అడుక్కుంటున్నాడు మంగపతి.

ఇంతకు ముందు రెండు దఫాలు పదవిరుచి మరిగిన రామస్వామి తన డాబు దర్పాలకు తాత్కాలికంగా తిలోదకాలిచ్చి వంగి వంగి దండాలు పెడుతూ, బతిమాలుతూ, కన్నీళ్ళు కార్చేస్తూ, గుండె బద్దలయ్యేలా వెక్కిళ్ళుపెట్టి ఏడుస్తూ, తనకు ఓటు వెయ్యకపోతే ఉరిపోసుకుంటానని కుండబద్దలుకొట్టి చెప్పేస్తూ గుమ్మాల వెంట పడ్డాడు. అతని సహధర్మచారిణి తనభర్త ప్రాణాలు కాపాడి తనకు పతిభిక్ష పెట్టవలసిందనీ, తన పసుపూ కుంకం నిలబెట్టవలసిందని ప్రాధేయపడుతూ, కుంకుమ బరిణె చేతబట్టుకుని ఇంటింటికి బయలుదేరింది.

వారం రోజుల్లో స్వాతంత్ర్యం రాబోతున్నదనగా వందేమాతరం అని అరిచి స్వాతంత్ర్య యోధుడనిపించుకుని, ఆ తరవాత ఈ ముప్పై ఏళ్ళూ ప్రజా ప్రభుత్వంలో కోరినవన్నీ సంపాయించుకుని కడుపులో చల్ల కదలకుండా వుంటున్న విస్సన్న కూడా మెడవంచి మోచేతులు పైకి మడిచాడు. "సొతంత్రం తెచ్చాను. ఊరు అభివృద్ధి చేశాను. రోడ్లు వేయించాను. కరెంటు దీపాలు వెలిగించాను. రైళ్ళూ బస్సులూ దిగుమతి చేయించాను. మీకు సేవచేసింది నేనే, ఇకముందు చేయగలిగిన వాణ్ణి నేనే! నాకే ఓటు వేయండి!" అని నిర్మొహమాటంగా దబాయించటం మొదలెట్టాడు.

"నాకు- పద్దెనిమిదిదేళ్ళు నిండాయి. ఓటర్స్‌లిస్టులో నా పేరూ వుంది. పదవిలో వుండే అర్హత నాకు మాత్రం లేదా?" పద్దెనిమిదేళ్ళు నిండిన వారంతా ఒక్కతాటిమీద నిలబడితేచాలు, నేనే గెలిచిపోతాను," అంటూ, బి. కాం. ఫస్ట్ ఇయర్ చదువుకుంటున్న సత్యమూర్తి కూడా రంగంలో దూకాడు.

–ఇలా ఎవరికివారు తమ తమ విజయావకాశాలను త్రికరణ శుద్ధిగా ప్రచారం చేసుకుంటూ – ఒక పదిమంది ఆసాములుజాతరలో బిచ్చగాళ్ళకుమల్లే ఊరుమీదపడి, పాపం, ఏ పాపమూ ఎరగని ప్రజల్ని ఉసురు పెట్టేశారు. అందరూ కరపత్రాలూ వేయించారు – మైకుల్లో కేకలు వేశారు – గోడలు ఖరాబు చేశారు – ఆకాశ వీధుల్లో బేనర్లు ఎగరేశారు.

రోడ్లు వేయిస్తామనీ, కరెంటు లాక్కొస్తామనీ, నూతులు తవ్విస్తామనీ, ఆస్పత్రులు కట్టిస్తామనీ, మురుగుదొడ్లు నిర్మిస్తామనీ, స్వర్గాన్ని నేలకు దించుతామనీ ప్రతి అభ్యర్థి ప్రమాణాలు చేశారు. కొందరైతే పన్నులు రద్దుచేస్తామనీ, ఇళ్ళు లేనివారికి ఇళ్ళు కట్టిస్తామనీ, హైరోడ్డు పొడుగునా వున్నజాగాను ప్రభుత్వంనుంచి లాక్కుని, అంగళ్ళు పెట్టుకోవటానికి బీదవాళ్ళందరికి పంచేస్తామనీ – ఏవేవో వాగ్దానాల అమృత వర్షం కురిపించారు.

ఇందరిలోనూ ప్రజలనోళ్ళల్లో ఎక్కువగా నానింది జయరాం పేరే! జయరాంకు అంతో యింతో మంచి పేరుంది. ఏమైనా మంచి పనులు చెయ్యగలడన్న






# ధర్మపథం | ఆత్మశాంతి

ప్రతీ వ్యక్తి తన జీవితం ఎలాటి చీకూ, చింతా లేకుండా గడచి పోవాలనే కోరుతూ ఉంటాడు. దీనికి డబ్బుతో నిమిత్తం లేదు. ధనం లేనివాడికే అన్ని చిక్కులూ ఉంటాయనీ ఉన్నవాడు నిర్విచారంగా ఉంటాడనీ అనుకోడానికి వీలు లేదు. ఈ విధంగానే జీవితం ప్రశాంతంగానే ముగియాలని కోరుకొంటారు. ప్రాణావసాన సమయంలో మనస్సులో- ఎలాంటి కోరిక గాని, చింత గాని ఉండ కూడదనీ, అందుకోసం ఆప్త బంధువులు "ఏమి కోరిక ఉన్నది?" అని అడిగి ఆ వ్యక్తి కోరిక తీర్చడానికి ప్రయత్నిస్తారు. లేదా హామి యిచ్చి మనస్సుకు కొంత తృప్తిని కలిగిస్తారు. కోరికతోనూ, విచారంతోనూ వ్యక్తి మరణిస్తే ఆతని ఆత్మకు శాంతి ఉండదు.

దీనికొక యథార్థ విషయాన్ని ఉదహరిస్తాను. ఒక గొప్ప జమిందారుగారి ఆస్థానంలో ఒక విద్వాంసుడు ఉండేవాడు. విద్వాంసులు ప్రభువులకు అభిమాన పాత్రులయినా, వారి ఆర్థిక పరిస్థితి అంతంతగానే వుంటుంది. ఇది అందరికీ తెలిసిన విషయమే! ఆ పండితునికి దినం గడవడమే చాలా కష్టంగా ఉండేది. ఆ ప్రభువుకు దేవునిపయి, జపాలపయి నమ్మకం వున్నది. తనకు కలిగిన ఏదో చికాకును తొలగించు కోడానికి ఆయన తగిన వారిచేత జపం చేయించాలని సంకల్పించాడు. ఆయన ఆదేశాన్ని అనుసరించి, ఆయన కార్య దర్శి ఆ పండితుని వద్దకు వచ్చి ప్రభువు కోరికను తెలియ జేశాడు. తగిన పారితోషికం ప్రతి నెలా లభిస్తుందని చెప్పాడు. ఆ విద్వాంసుడు పరమానంద భరితుడై దీక్షతో జపం ప్రారంభించాడు. నెల్లాళ్ళయాక- డబ్బుకోసం ఎదురు చూశాడు. డబ్బు రాలేదు. రాక ఏమవుతుంది? అనే ధీమా తో ఆరు నెలలు జపం సాగించాడు. డబ్బు రాలేదు. జమిందారు దీనిని విస్మరించి ఉండాలి. ఆయనను ఎవ్వరు హెచ్చరించ గలరు? ఆ పండితునికి ఋణ భారం ఎక్కువ అయింది. జబ్బు పడి, అవసాన దశవచ్చింది. తనకు డబ్బు రాలేదనీ, కుటుంబ పరిస్థితి ఎలా ఉంటుందో అనీ కలత పాటు ఎక్కువ అయింది. "ఇంకా డబ్బు రాలేదా?" అనే కలవరింత! ఆ కోరికతో ప్రాణం పోతే అతని ఆత్మకు శాంతి ఉండదని, ఆలోచించి సన్నిహితులలో ఒకడు ఒక రూపాయి బిళ్ళ అతని చేతిలో ఉంచుతూ "కలత పడకండి. జమిందారుగారు బ్యాంకికి మనిషిని పంపారు. గంటలో డబ్బు

వస్తుంది, అయిదు నూట పదహార్లు! మీకు నమ్మిక కోసం ముందుగా మనిషి చేత ఈ రూపాయి పంపారు" అని మెల్లగా అర్థమయేటట్లు చెప్పాడు. ఆయన తృప్తిగా తల ఊచాడు. మరి కొంచెం సేపటి లోనే ఆయన శరీరం చాలించాడు నిర్విచారంగా.

—బులుసు వేంకట రమణయ్య

---

నమ్మకం అందరికీ వుంది. మొదటినుంచ ప్రజలతో కలిసి మెలిసీ వుంటున్నవాడు అతనే. కనక, జయరాం తప్పక గెలుస్తాడన్నమాట బాగా వ్యాపించి పోయింది.

పోలింగు దగ్గిర పడేకొద్దీ ఎన్నికల హంగామా ఎక్కువైపోయింది అందరి ఆగడాలూ హద్దులు దాటాయి. రామస్వామైతే ఓటర్ల కాళ్ళుకూడా పట్టుకుంటున్నాడన్న వదంతి వ్యాప్తిలోకి వచ్చింది. ఇక మంగపతి సరేసరి – ఆపిల్ పండులా వుండే

మనిషి ఎండావానా, పగలూ రాత్రీ, సిగ్గూ ఎగ్గూ ఏమి తెలియకండా వీరవిహారంచేసి, ఎండిపోయిన వంకాయలా తయారయ్యాడు. తన స్వంత సినిమా హాలులో మూడురోజుల పొడుగునా టిక్కెట్టు లేకుండా సినిమా చూపించాడు పోలింగు ముందురోజు రాత్రి కొన్ని ప్రాంతాల్లో – పీనుగులు సైతం లేచి కూర్చునే మంత్రించిన కాగితాలు కొన్నిటిని పంచిపెట్టారని ఆనోటా ఈ నోటా చెప్పుకున్నారు. అందుకు దాఖలాగా – తాగి తూలేవాళ్ళు ఆ రాత్రి ఎక్కువగానే కనిపించారు

అయినా జయరాంకు ఏ ధోకాలేదన్నారు వేగులవాళ్ళు.

పోలింగురోజున మంగపతి ఏర్పాటు చేసిన వ్యాన్లు, ట్రాక్టర్లూ ఓటర్లకు ఎనలేని సేవ చేశాయి.

పోలింగు ముగిసింది

ఓట్ల లెక్కింపు పూర్తయ్యేసరికి అర్ధరాత్రి దాటింది.

నూట పదకొండు ఓట్లు దాటనివాళ్ళు ఎనమండుగురు. ప్రజల అంచనా ప్రకారం జయరాంకు ఎక్కువ ఓట్లు వచ్చాయి అయితే వంద ఓట్ల మెజారిటీతో మంగపతి గెలిచాడు ఎన్నికల ఫలితాలకోసం ఆ రాత్రిపూట గుమిగూడిన ఓటర్ల సంఖ్య చిన్నది. ఏది ఏమైతే మనకేమని గుర్రుపెట్టి నిద్రపోతున్న ఓటర్ల సంఖ్య చాలా పెద్దది

ఎవడో ఒకడు పరమయోగ్యుడని తేల్చి పారేస్తుంది – భారత ప్రజాహృదయం' □

# హైదరాబాద్ నోట్‌బుక్

## మానవతా మూర్తి మండలి షష్ట్యబ్ద పూర్తి:-

శ్రీ మండలి వెంకట కృష్ణారావును తలచుకొన్నప్పుడూ, చూచినప్పుడూ నాకు ఆయన రెండు అవతారాలు జ్ఞాపకం వస్తాయి: మొదటిది ప్రపంచ తెలుగు మహా సభావతారం; రెండవది జలప్రళయావతారం నిజానికి జల ప్రళయావతారమే మొదటి జ్ఞప్తిపథంలో పరుగులిత్తుతుంది ఎనిమిదిన్నర ఏళ్ల నాటి సంగతి. ఆనాడు శనివారం, 1977 నవంబరు 19. సూర్యుడు అనుదినమూ ఉదయించినట్టే ఆ దినమూ ఉదయించాడు. ప్రజలు నిత్యకృత్యాలు యధా విధిగానే సాగించారు. కాని ఒకే భేదం తుఫాను సూచనలున్నాయి. జాగరూకతతో మెలగాలిసుమా!- అని వాతావరణ శాస్త్రజ్ఞులు హెచ్చరికలు చేశారు సరేలే. ఈ తుఫానులు ఎప్పుడూ ఉండేవే. ఎన్నిటినో చూచాము. దీన్ని చూద్దాంలే- అనుకున్నారు ప్రజలు - దివి సీమ ప్రజలు యాదమరచి నిద్రపోయారు. పాపం! వాళ్ళు కలగన్నారా, ఒక్క శతాబ్దం క్రితం మచిలీపట్టణాన్ని ముంచెత్తి వేలాది ప్రజలను పొట్టన బెట్టుకున్న మహా జల ప్రళయం కన్నా తీవ్రమయినది తమపై వికటాట్టహాసంతో విరుచుకు పడుతుందని? రాత్రి కొన్ని గంటలలో అంతా సమాప్తమైంది సముద్రుడు ఎందుకు ప్రజలను కన్నెర్రజేశాడో. ఎందుకు అంత దారుణంగా దండిచాడో తెలియదు అలాటి సంకట పరిస్థితులలోనే కదా కొన్ని నిత్య సత్యాలు పునర్నిరూపితమవుతాయి? అగ్నిలో పడితేనే కదా అపరంజి ఏదో తెలుస్తుంది. అప్పుడె గదా పరోపకారాయ సతాం విభూతయః- అన్న భర్తృహరి సూక్తి మరొక మారు ప్రపంచమంతటా మారు మ్రోగుతుంది. మారు మ్రోగిన ఆ సూక్తి మానవ రూపమే శ్రీ మండలి వెంకట కృష్ణారావు. శ్రీ మండలి తుఫాను తరిమి కొట్టిన నాడు కాకతాళీయంగా అవనిగడ్డలో ఉన్నారు. ఆయన లోని మానవత్వం ఉప్పెన కన్నా ఉవ్వెత్తుగా లేచింది- వేయి మదగజాల బలంతో ఉప్పెన రాక్షసి కరాళకృత్యాలను గురించి తెల తెల వారగానే వేయి పదుల వార్తలు వ్యాపించాయి. మండలి తమ ఒంటి మీద గుడ్డలున్నాయా, లేవా అనికూడ చూచుకోలేదు. పాద చారులై బయలు దేరారు. దివి సీమ అంతా మహాభారత రణరంగంలా వుంది. ఆయన కూలిపోయిన ఇండ్ల మధ్యన నడిచారు చచ్చిపడిన పశువుల మధ్యన నడిచారు రాయి రప్ప, ముళ్ళు గుళ్ళు సరకు చేయకుండా నడచారు తమ ఆరోగ్యం సరిగా లేక పోయినా నడిచారు జల-ప్రళయానంతరం మిగిలిన వారి మనసులో బలం నింపడానికి నడిచారు. కాళ్లలో ముళ్ళె ఆరు ముళ్ళు దిగబడ్డాయి కాళ్లకు కట్లు కట్టించుకొని నడిచారు. ఒక్క మాటలో ప్రజల హృదయాలలోనే నడిచారు విరామమెరుగని నడక పల్లె పల్లెకు తిరిగారు, పరిస్థితి చూచారు పరితపించారు, పరితాపం పోగొట్టారు ప్రయత్నాని కడిలించారు



ఇలా తుఫానుకు దెబ్బతిన్న ప్రాంతాన్నంతా కాలిక బలపం కట్టుకొని తిరిగారన్న సామెతగా తిరిగారు ప్రజలలో విశ్వాసం నింపారు, విషాదం పార-ద్రోలారు చేయదగిన సాహాయ్యం చేశారు, చేయించారు మాసిన గడ్డంతో, బెదురు చూపులతో, మోకాళ్ల పైకి ఎత్తి బొడ్డులో చెక్కిన ధోవతితో, బురద కాళ్లతో, జనానికి ఏదో సహాయ వస్తువు అందిస్తున్న చేతులతో మూర్తిభవించిన విషాదంలాగ వున్న ఆయన అవతారాన్ని దేశ దేశాల వారూ దూరదర్శినిలో చూచారు ఉప్పెన నష్టాన్ని వివరిస్తున్న ఆయన మాటలు విన్నారు సహృదయతతో సాహాయ్య ధనం కురిపించారు. దివిసీమ బాధితులను పునరుజ్జీవింప జేశారు సర్వ సంస్థల కార్యకర్తలు కుల మత వర్గ రాజకీయ సిద్ధాంత భేదం లేకుండా ఆయనను ప్రశంసించారు. బద్ధశత్రువులు కూడ కొనియాడక తప్పలేదు జలప్రళయావతారం విషాదావతారమైతే, ప్రపంచ తెలుగు మహాసభావతారం పరమోత్సాహావతారం మొదటి మహాసభ ఒక తెలుగు జాతర తెలుగు వారు తమ రెండు మూడు సహస్రాబ్దాల గత చరిత్ర వైభవాన్ని ఆ జాతరలో తెలుసుకొని మురిసి పోయారు ఎటుచూచినా కనిపిస్తూ, ఎవరిని చూచినా పలుకరిస్తూ, ఏమికోరినా అందజేస్తూ, పరమాణువులోని పరమ సూక్ష్మాంశాలలాగ తిరుగుతూ తెలుగు వారి హృదయాలలో పెద్ద పీట వేసుకొన్నారు మండలి రెండవ ప్రపంచ తెలుగు మహాసభా సంరంభంలో, మలేషియాకు వెళ్ళే ప్రతినిధుల ప్యాస్‌పోర్టు ఫారంలు పూర్తిచేయడం మొదలు సంతకాలు పెట్టడం, ప్యాస్‌పోర్ట్ కార్యాలయానికి ఫోను చేయడం, వాటిని రప్పించడం, ప్రతినిధులకు అందజేయడం వారిని రైళ్లలో, బస్సులలో, విమానంలో మద్రాసుకు చేరవేయడం, అక్కడ మీనంబాకం విమానాశ్రయంలో వారిని విమానాలు ఎక్కించడం, ఏవో తభావతులు జరిగితే వారిని సమాధాన పెట్టడం, దుండగులు దూషించినా, ప్రజాకార్యమన్న దృష్టితో పెదవి కదపకపోవడం, తీరా అందరూ విమానాలు ఎక్కినా, తాము ఎక్కలేక విమానాశ్రయంలో దిగబడి పోవడం వరకు- ఇవన్నీ నాకు చలన చిత్రంలాగ కళ్ల ఎదుట తిరుగుతూ విమాన యాత్రికులకు వీడ్కోలిస్తున్న ఆ ఉత్సాహ తరంగితావతారం తెరనిండా క్లోజప్‌లో కనిపిస్తుంది ఈ రెండు సంఘటనలు చాలు ఆయన మానవ సేవకుడని, కార్యాచరణ దక్షుడని చెప్పడానికి, ఆయన జీవితం సార్థకమని నిరూపించడానికి. శ్రీ మండలి ధైర్య సాహసాలు పెనగొన్న రాజనీతిజ్ఞుడు, గాంధీ మార్గాన్ని నమ్మిన సమతావాది, ఉపజ్ఞగల వ్యవస్థాపకుడు, విశ్రాంతి ఎట్టిదో ఎరుగని విశుద్ధకార్యకర్త, నిరాడంబరత సర్వసులభత నిండారిన నాయకుడు, పదవి ఉన్నా ఊడినా వాడని పొగడపూవు ఒక్క మాటలో ప్రజల మనిషి ఇంతటి ఉత్సాహానందాలతో నవయువకుడుగా నవ యువతను నడిపిస్తున్న శ్రీ మండలికి షష్ట్యబ్ద పూర్తి అంటే ఆశ్చర్యం- నమ్మట్టుకునాకు అయినా, నూట యిరవై యేళ్ల పూర్ణాయుస్సులో ఇది సగమేకదా, ఇంకా ఆరు దశాబ్దాలపాటు ఆయన సేవను ప్రజలు అందుకోవచ్చు గదా! - అని మనస్సును ఊరడించుకొన్నాను సేవ, సహృదయత కరవై పోయిన ఈ కటిక కాలంలో శ్రీ మండలి వంటి ప్రజాసేవా పరాయణులు చాల అరుదు; వారు చాల అవసరం. ఆగస్టు 4వ తేదీకి 60 ప్రజాసేవా సంవత్సరాలు నిండిన శ్రీ మండలిని మనసారా అభినందిస్తూ, ఇక ఆరు సేవా దశాబ్దాల పాటు' ఆరు పదుల సేవా సంస్థలను నిర్వహిస్తూ, తమ వంటి, తమను మించిన సేవాధురంధరులను రూపొందించాలని, అలాటి శక్తి స్థైర్యాలు ఆయనకు లభించాలని కోరుకుంటున్నాను (నా కోరిక లేవి ఇంతవరకూ వ్యర్థం కాలేదు.

### ఉపశ్రుతి:-

ఒక సమావేశంలో తెలుగు విజ్ఞాన సర్వస్వం నిర్వాహక సంపాదకులు శ్రీ చిమకుర్తి శేషగిరిరావు మిత్రులతో పాటు కూర్చుని ఉన్నారు ఇంతలో ఉస్మానియా విశ్వ విద్యాలయం సంస్కృత ప్రొఫెసర్ డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు వచ్చారు మీకు గిర్వాణం ముదిరింది ఇంత ఆలస్యంగా వచ్చారేం? - అన్నారు శ్రీ శేషగిరిరావు చలోక్తిగా ప్రత్యుత్పన్నమతి అయిన డాక్టర్ శ్రీరామచంద్రుడు వెంటనే జౌను మీరు తెలుగు మీరిపోయారు ముందే వచ్చి కూర్చున్నారు, - అన్నారు

—తిరుమల రామచంద్ర

# ఆగస్టు 15.....!

– శేఖర్..
పద్మ..






















జయసుధ, మురళీమోహన్, "వివాహబంధం"లో

## సుమన్‌తో ఎన్. ఎన్. భట్ చిత్రం

"ఈ జీవననగాగి-అనే విజయవంతమైన కన్నడ చిత్రాన్ని పునర్నిర్మిస్తున్నాను. నవంబర్, డిసెంబర్‌లలో షూటింగ్ ఉంటుంది" అన్నారు ఎన్. ఎన్. భట్. ఈయన దేవి అండ్ దేవి ఫిలిమ్స్ బానర్‌లో నిర్మించే చిత్రంలో సుమన్, జేబీ కాలిని ఆపిగా గలవారు పాల్గొంటారు. సత్యానంద్ సంభాషణలు, సత్యం సంగీతంతో వాసూ పీతాంబరం కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## "సంకెళ్ళు"

"సర్వ మానవ సమానత్వాన్ని చాటే జాతి వృత్తం. కుల మత వర్ణ విభేదాలతో తల్లడిల్లిపోతున్న సమాజాన్ని సమత, మమత-అనే సంకెళ్ళతో బంధించాలి అనిప్రబోధించే చిత్రం. జూలై 20 నుంచి 30 వరకు కారంచేడులో మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం. భారతీరాజా దర్శకత్వంలో ఒక తమిళ చిత్రంలో అద్భుతంగా నటించిన పగ్గుబాట రాజా హీరో. చాలా కాలానికి ఎం. ఎస్. విశ్వనాథం సంగీతం సమకూర్చిన తెలుగు చిత్ర మిది. అలాగే చాలా కాలం తర్వాత కె. ఎస్. ప్రకాశరావుగారు ఈ చిత్రంలో దర్శన మిస్తున్నారు" అన్నారు జి. రాజేంద్ర, ప్రసాద్, ఈయన నిర్మించే ఆర్. ఏ. ఆర్ట్స్ వారి పై చిత్రంలో రమ్య నాయిక. కాశీ విశ్వనాథ్ మాటలు, వేటూరి గీతాలు, నవకాంత్ ఛాయ, ఏ. సుబ్బారావు ప్రొడక్షన్, నాగేశ్వరరావు కూర్పుతో ఏ. సాంబశివరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## "మన్నెంలో మొనగాడు"లో సూరీడు తిరుగుబాటు

రచ్చబండ ... సూరిడు (అర్జున్), సంగం

## సినిమా (38 వ పేజీ తరువాయి)

(గొల్లపూడి) మున్నగువారున్నారు.

"సూరిడూ! ఎన్నెల్ని నువ్వు మనువాడ్డానికీల్లేదు," అన్నాడు గూడెం పెద్ద.

"ఎందుకు యీల్లేదు?" సూరిడు అడిగాడు.

"గుడెం ఆసారం పెకారం మూడు రాత్తుల్లు యిల్లు సేరకుండా యిదం సెడిన ఆడపిల్ల - గూడెం జనం సమక్షాన జిల్లేడు పాలు తాగి సచ్చిపోవాల. ఇది గూడెం నిర్ణయం," అన్నాడు గూడెం పెద్ద.

"యిది బతికొచ్చింది సచ్చిపోడానిక్కాదు -నాతో కలిసి బతకడానికి - ఏ ఆసారాలు నాకు అనవసరం. దాన్ని నేను లెక్క సేయను," అని సూరిడు అంటూండగా సింగం అందుకుని, "బాగా సెప్పావురా, సూరీడూ! యిదం సెడిన ఆడది జిల్లేడు పాలు తాగి పోవాలంటే మన ఎన్నెలే కాదు, యీ గూడెంలో శానామంది పోవాల. మరా తప్పు సేసినోళ్ళకు మన ఆశారం ఏం సేత్తుందో పెద్దలు సెప్పరేం?" అన్నాడు.

గూడెం పెద్ద కోపంతో "ఇదో-- మువ్వకనవసరం. సూరిడూ! సెప్పిన మాట వినకుండా మొండికేత్తావో -నిన్నూ, ఎన్నెల్నీ గూడెం నుంచి ఎలేస్తాను," అన్నాడు.

"మీరెవరు మమ్మల్ని ఎలెయ్యడానికి? మేమే మీ గూడేన్ని ఎలేస్తున్నాము. మీ గూడేనికి, మాకూ సంబంధంలేదు. అడవిలో బతికే జీవాలన్నిటిలాగా అడవిలోనే మేమూ బతుకుతాం," అంటూ సూరిడు అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. గోపాల్‌రెడ్డి నిర్మించిన భార్గవ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "మన్నెంలో మొనగాడు" చిత్రం త్వరలో విడుదల.

## "ఉమ్మడి మొగుడు"గా శోభన్‌బాబు

"నాయికలు రాధిక, కీర్తి. వీరికి శోభన్‌బాబు ఉమ్మడి మొగుడుగా నటిస్తున్నారు," అన్నారు రాఘవేంద్ర మూవీ క్రియేషన్స్ అధినేత కె. వి. వి. సత్యనారాయణ. ఈయన జూలై 16న బి. భాస్కరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ప్రారంభించిన చిత్రానికి మద్దిపట్ల సూరి, చక్రవర్తి, చంగయ్య, సత్యం తెర వెనుక కృషి చేస్తున్నారు.

## "అరణ్యకాండ"లో అక్కినేని నాగార్జున





"చాణక్య శపథం"లో విజయశాంతి, చిరంజీవి



"పోలీసు ఆఫీసర్"లో భానుచందర్, సుహాసిని

## సాయిచంద్ "ప్రళయం"

"జమీందారీ కుటుంబానికి చెందిన ఒకాయనకు ఒక కూతురు, నలుగురు కుమారులు. కూతురికి సంగీతమంటే ఎంతో ఇష్టం. ఒక యువకుని ద్వారా సంగీతం నేర్చుకుంటుంది. చివరికి ఆ యువకుని వరిస్తుంది కూడా. పెద్దలను ఎదిరించి అతనితో ఊరు వదలి వెళ్ళిపోతుంది. ఆమె సోదరులు వెంబడించి ఆ సంగీతం మేష్టారును హతమారుస్తారు. ఆ యువకుని అన్న మిలిటరీ నుంచి రాగానే తన తమ్ముడి హత్య గురించి తెలుసుకొని ఆ జమీందారీ కుటుంబం మీద పగ సాధించుకుంటాడు. కథ కన్నా కథనం గొప్పగా ఉండే ఈ ఫక్తు కమర్షియల్ చిత్రాన్ని డైరెక్టర్ రాజసేన ఎంతో థ్రిల్లింగ్‌గా తీశారు," అన్నారు ప్రముఖ నటుడు సాయిచంద్. ఈయన త్వరలో విడుదల చేసే సాయి సినీ కమర్షియల్స్‌వారి "ప్రళయం"లో ఈయనతో పాటు చరణ్‌రాజ్, చలపతిరావు, జీవా, రామరాజ్, జెనర్జీ, రాళ్ళపల్లి, వేలు, చిత్ర, జానకి, కె. విజయ, కృష్ణవేణి, వాణి, శకుంతల, జయమాలిని, ప్రముఖ మలయాళ నటుడు టి. ఎ. రవి పాల్గొన్నారు. తనికెళ్ళ భరణి సంభాషణల కర్త. కె. వి. మహదేవన్ స్వరకల్పనలో అదృష్టదీపక్, సాహితి గీతాలు రాశారు. వి. కరుణాకర్ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, శేషు - రాజా - శ్రీధర్ నృత్యాలు, సెల్వమణి సాహసాలు, రఘునాథరెడ్డి సహకార దర్శకత్వం, మాంధాత ప్రొడక్షన్, మురళీ కూర్పుతో ఎం. వి. ప్రసాద్ సహ నిర్మాత. డాక్టర్ త్రిపురనేని రమేష్‌బాబు నిర్మాత. సమర్పణ: కె. రాధాకృష్ణ, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: రాజసేన.

## సినిమా

మమ్మీ! నేను స్కూల్లో చేరను -
సినిమాల్లో చేరతాను!



## "డబ్బెవరికి చేదు"

"డబ్బు కోసం గడ్డి తినేవారే కాదు; విడిపోయె దంపతులు కూడా ఉంటారు. ఒక లక్షాధికారి ఆస్తిని పొందాలనే పేరాశతో కొందరు పడే తాపత్రయం ఆద్యంతం కడుపుబ్బ నవ్విస్తుంది," అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. రామలింగరాజు నిర్మించే తారకనామా మూవీస్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, శరత్‌బాబు, రాజేంద్రప్రసాద్, వేలు, వీరభద్రరావు, నూతన్‌ప్రసాద్, ఈశ్వరరావు, పొట్టి ప్రసాద్, సాక్షి రంగారావు, సీత, మనోచిత్ర, సులక్షణ, దీప, శ్రీలక్ష్మి గెస్ట్‌గా సత్యనారాయణ నటిస్తున్నారు. మల్లాది వెంకటకృష్ణమూర్తి కథకు దివాకర్‌బాబు సంభాషణల కర్త. వాసూరావు స్వరకల్పనలో ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి గీతాలు రాశారు. బి. కోటేశ్వరరావు ఛాయ, ఆంథోని - నంబిరాజా నృత్యాలు, సోమయ్య - భాస్కర్ శిల్పం, కె. గురుదేవ్ సంయుక్త దర్శకత్వం, పి. సి. ప్రసాద్ నిర్వహణ, రాజేష్ సహకార దర్శకత్వం, కృష్ణమూర్తి ప్రొడక్షన్, డి. రాజగోపాల్ కూర్పుతో గంధం జగన్‌మోహనరావు నిర్మాత. "జూలై 28 నుంచి ఆగస్టు 28 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు సమర్పకులు ఎ. పోతరాజు.

## శ్రీ సారథి స్టూడియోస్ "జైలు పక్షి" లో శోభన్‌బాబు, రాధిక, విజయశాంతి

"జూలై 9 నుంచి 26 వరకు హైదరాబాద్‌లో తొలి షెడ్యూల్ పూర్తి చేశాం. మలి షెడ్యూల్ శ్రీశైలం, సీలేరు ప్రాంతాలలో ఆగస్టు 1 నుంచి 14 వరకు. డైరెక్టర్ కోడి రామకృష్ణ, కెమెరామన్ ఎస్. గోపాలరెడ్డి కలిసి పని చేస్తున్న మొదటి చిత్ర మిది" అన్నారు పి. శశిభూషణ్. ఆయన నిర్మిస్తున్న పై చిత్రంలో శోభన్‌బాబు, రాధిక, విజయశాంతి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, వేలు, రాజ్‌వర్మ, కృష్ణవేణి, కొత్త విలన్ కృష్ణారావు, నిర్మల, హైదరాబాద్ కళాకారులు, ఒక కీలకమైన పాత్రలో బేబీ శాలిని నటిస్తున్నారు. కలైమణి కథకు పరుచూరి సోదరులు పదునైన సంభాషణలు రాశారు. సి. నారాయణరెడ్డి, సిరివెన్నెల సీతారామశాస్త్రి గీతాలకు కె. వి. మహదేవన్ స్వరకర్త. భాస్కరరాజు శిల్పం, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు, గౌతంరాజు కూర్పు తెర వెనుక హంగులు. నవయుగ విడుదల.

"కలియుగ కృష్ణుడు"లో శారద



"జైలు పక్షి"లో శోభన్‌బాబు

## కృష్ణ, భారతీరాజా కాంబినేషన్‌లో "జమదగ్ని"

"ఆగస్టు నుంచి అక్టోబర్ వరకు ప్రతి నెలా 1-10 తేదీల మధ్య కాశ్మీర్, మైసూర్, మద్రాస్‌లలో జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అని పవన్ ప్రొడక్షన్స్ అధినేతలు చుక్కపల్లి వేణుబాబు, బి. శ్రీకంఠారెడ్డి తెలియజేశారు. రాధ నాయిక. సెల్వరాజ్ కథ, ఇళయరాజా సంగీతం, కణ్ణన్ ఛాయతో భారతీరాజా స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.



"తాయారమ్మ - తాండవకృష్ణ"లో రజని, అర్జున్

## కోడి రామకృష్ణ, నాగార్జునలతో ఎస్. గోపాలరెడ్డి చిత్రం

"అక్టోబరు 10-30, నవంబర్ 15-30 వరకు రెండు షెడ్యూల్స్ జరుగుతాయి" అన్నారు ఎస్. గోపాలరెడ్డి. ఈయన "మన్నెంలో మొనగాడు" అనంతరం నిర్మించే భార్గవ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ 8 వ చిత్రంలో నాగార్జున సరసన శోభన నాయిక. గణేష్‌పాత్రో, సి. నారాయణరెడ్డి, కె. వి. మహదేవన్, పి. లక్ష్మణ్, కొండపనేని రామలింగేశ్వరరావు, సాహుల్, శివ సుబ్రహ్మణ్యం, కె. సత్యం, పి. వెంకటేశ్వర రావు, రంగారెడ్డి ప్రభృత సాంకేతిక బృందంతో కోడి రామకృష్ణ దర్శకుడు.

## సినిమా

### "ఆణి ముత్యం"

"ముగ్గురు సహృదయులతో అనేక మలుపులతో అల్లబడిన రసవత్తరమైన కథ. మానవత్వం మూర్తీభవించిన పాత్ర శరత్‌బాబుది. దేశ శ్రేయస్సు కోసం ప్రాణాలను సైతం అర్పించే పాత్ర రాధికది" అన్నారు బందెల ఈశ్వరరావు. దాసరి శిష్యుడైన ఈయన కథ, స్క్రీన్‌ప్లే, పాటలు, దర్శకత్వంలో పాలకొల్లు వాణిజ్యవేత్తలు వీరా రామకృష్ణ, ముత్తిరెడ్డి ఆదినారాయణ నిర్మించే కళా వాహిని క్రియేషన్స్ వారి పై చిత్రంలో రాధిక, శరత్‌బాబు, రాజేంద్ర ప్రసాద్, అల్లు రామలింగయ్య, రమాప్రభ ఆదిగా గలవారు పాల్గొంటారు. చంద్రశేఖర్ సంగీతం, కె. ఎస్.మణి ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, కృష్ణంరాజు కూర్పు, సి. హెచ్. సాంబశివరావు నిర్వహణతో కాపుగంటి వి. రమణరావు ప్రొడక్షన్ కంట్రోలర్. మండెల వీరభద్రరావు సహ నిర్మాత.

## కె. విశ్వనాధ్, చిరంజీవి కాంబినేషన్‌లో ఏడిద నాగేశ్వరరావు చిత్రం

"సెప్టెంబర్‌నుంచి షూటింగ్," అన్నారు పూర్ణోదయా అధినేత ఏడిద నాగేశ్వరరావు. ఈయన 7వ చిత్రంలో చిరంజీవి హీరో. "శుభలేఖ" అనంతరం కె. విశ్వనాధ్ దర్శకత్వంలో చిరంజీవి నటించే చిత్రమిది. □

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial 75667*

శ్రీమతి చెరుకూరి లక్ష్మీ భారతి సమర్పించు

GOLD SPOT

విజయభాస్కర్ ఫిలిం ప్రొడక్షన్స్

# దేశోద్ధారకుడు



దర్శకత్వం యస్.యస్.రవిచంద్ర   నిర్మాత. ధనేకుల మురళీమోహనరావు

సంగీతం శ్రీ సాయికృష్ణ,   విడుదల: వీరబ్రహ్మేంద్ర కంబైన్స్,

# COLOURFUL 5th ANNIVERSARY OF MAHESHWARI-70MM AND PARAMESHWARI-35MM

(India's Prestigious theatres)

## HYDERABAD

### 10th AUGUST, 1986



T. Subbarami Reddy, Managing Director and the Management of Maheshwari and Parameshwari theatres thank all their esteemed Film fans, Producers, Distributors and Well-wishers for their valued patronage, which made the theatres to enter into yet another colour year.

With best compliments of

**Sri KISHEN CHAND**
**VANDANA PICTURES**
**SECUNDERABAD**

**S. SRIKANTIAH**
General Manager



**T. SUBBARAMI REDDY**
Managing Director

**ANNUAL TOTAL GROSS COLLECTIONS**

| YEAR | MAHESHWARI | PARAMESHWARI |
|---|---|---|
| 1982 | Rs. 53 lacs., | Rs. 41 lacs., |
| 1983 | Rs. 54 lacs., | Rs. 42 lacs., |
| 1984 | Rs. 56 lacs., | Rs. 47 lacs., |
| 1985 | Rs. 59 lacs., | Rs. 50 lacs., |
| 1986 | Rs. 63 lacs., | Rs. 51 lacs., |

**TOTAL AMOUNT PAID TOWARDS ENTERTAINMENT TAX 1982 — 1986 (FIVE YEARS)**

| MAHESHWARI - 70MM | PARAMESHWARI - 35 MM |
|---|---|
| RUPEES ONE CRORE | RUPEES EIGHTY LAKHS |

**GROSS COLLECTIONS OF SUPER HIT PICTURES IN OUR THEATRES**

| FILMS | MAHESHWARI-70MM | FILMS | PARAMESHWARI-35MM |
|---|---|---|---|
| SILSILA | Rs. 13 lacs., | JAWS | Rs. 16 lacs., |
| YARANA | Rs. 12 lacs., | DISCODANCER | Rs. 26 lacs., |
| MAHAAN | Rs. 12 lacs., | ANDHAA KHANOON | Rs. 13 lacs., |
| BETTAAB | Rs. 30 lacs., | KASAM PAIDA KARNE WALEKI | Rs. 18 lacs., |
| SHARAABHI | Rs. 28 lacs., | TAWAAIF | Rs. 14 lacs., |
| NAMAK HALAAL | Rs. 50 lacs., | COOLIE | Rs. 17 lacs., |
| SAAHEB | Rs. 15 lacs., | AAJ KA DAUR | Rs. 12 lacs., |
| ARJUN | Rs. 17 lacs., | SWARG SE SUNDER | Rs. 12 lacs., |
| GERAFTAAR | Rs. 14 lacs., | | |
| DILWAALA | Rs. 13 lacs., | | |

LAA



NAGENDER